# చలో హైద్రాబాద్

(సాంఘిక నాటకం).

వేదాంతకవి.

సాచిన్నారి తెనుగు బెలికాండ్రైన శ్రీ నూలిలక్ష్మీనారాయణ శ్రేష్ఠి
జయించారులకు

# అంకితము




శ్రీకృష్ణా మహేశ్వరి
ప్రాకారము టంకసాల భాగారముగా
నాకీడుగ సమర్పింతు

# చలో హైద్రాబాద్

రచయిత:

వేదాంతకవి.

## కవితా సంస్థానము

---

పాసఁ శ్రేణి మనం మంజులకళా పద్మాక్షి మంజీర నా
ట్యానందోత్సవ మంగళధ్వనులు తోడై రత్నభూస్వామి ల
క్ష్మీనారాయణు నింక బెంచుకొనె కూర్మిం పుత్ర భాగ్యమ్ముగాన్ ॥

## హెచ్చరిక.

ఈ "చలో హైదరాబాద్" నాటకాన్ని నా లిఖితపూర్వకమైన అనుమతి లేనిదే, ఎవ్వరూ ఎక్కడా ఏవిధంగానూ ప్రదర్శనగాగాని ప్రకటించుకొనరాదు. సినిమాకి గాని, గ్రామఫోన్ రికార్డులకు గాని, రేడియో కాలక్షేపాలకి గాని, హరికథా కాలక్షేపాలకి గాని ఈ "చలో హైదరాబాద్" నాటకం కథావస్తువును గాని, పద్య, గద్య, గేయాల్ని గాని వాడుకోగూడదు. అట్లా అతిక్రమించి ఎవ్వరైనా ఆడుకొని గాని, వాడుకొని గాని యున్నట్లయితే నేను నా నష్టానికి జరిపే క్రిమినల్ సివిల్ చర్యలకు వాళ్ళంతా బాధ్యులు కాగలరని తెలియజేయుచున్నాను.

ఇట్లు

వేదాంతకవి

అను

వేదాంతం వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, బెజవాడ.

౫

కీర్తికొండల చక్రవర్తికంటె గడించిన
పెనుగొండ కొక బంగారుకొండ
సిరి కుబేరుని యంతిపురము కన్నార్జించి
లెక్కకెక్కినయింటి చక్కనయ్య
ప్రేమవసంత భూస్వామికంటె రచించు
శాంతిదాతకు పెద్ద షావుకారు
చెలిమి కర్ణసుయోధనులమించి చూపించి
కవికులాభరణమ్ముగ నినవాఁడు

సులలిత సుగుణమణియైన సుబ్బరాజు
నోచుకొన్న నోములతోట పూచుచోట
లక్ష్మీనారాయణుండై బలముగ గల్గె
నూలిరతనాలకోట వజ్రాలమూట॥

౬

జిలుగుశయ్యా రత్నసింహాసనము చెంత
వీరభారత పదవీ ప్రశస్తి
బుర్ర చుర్రుమన్న యెఱ్ఱాప్రెగడవారు
పొగడలైరి వీరి ప్రెగడలైరి॥

౭

నన్నయగ చెళ్ళపిళ్ళ వెంకన్న వచ్చె
ఘటికుఁడై వచ్చె ఎఱ్ఱాప్రెగడ బుధుండు
తిక్కనవలె వచ్చితినేను తెనుఁగులార!
రాజరాజనరేంద్రుని రాజ్యమునకు॥

౯

దీనోద్ధారకుఁడై ప్రఫుల్ల సుమసాధ్వీ రత్న కేయూర వ
ల్లీ నేత్రోత్సవ మాధవుండగుచు కల్మిం జెట్టె పుష్పావతీ
గానంబుల్ పెనుగొండకెక్కెడి శ్రుతిం కళ్యాణినింజేసి ల
క్ష్మీనారాయణ శ్రేష్ఠి విశ్వపరమేష్ఠిం దన్పు సంతుష్టుఁడై ||

౯

ఈ పెనుగొండప్రైస్ గడియించిన పూర్వ్వతపఃఫలంబుచే
భూపతియై స్వతంత్రకులభూషణ మోహనచక్రవర్తియై
మా పసి బాబులందఱికి మార్గముగా బడికట్టినట్టి యీ
శ్రీపతికిచ్చుచుంటిని యశేష యశోధనమిచ్చు నాకృతిన్ ||

౧౦

ఈ నవ్యోదయలక్ష్మి చక్కని కథాహేలాకళావిశ్వ సం
స్థానంబందుదయించి, యప్సరస గీతాగానగాంధర్వ వా
ణీ నృత్యంబొలికించి, రాగరస మాణిక్యాలతో నూలి ల
క్ష్మీనారాయణ శ్రేష్ఠి నీకడకువచ్చెం నేఁడు పాలింపుమా ||

౧౧

నీనేస్తమ్ము ననేక కావ్యమహిళానీకమ్ము గైకొంటకై
మేనాలెక్కి తళుక్కునం మెఱసి నీమేడం ప్రవేశించు నా
నీ, నాకావ్యకళా పురంధ్రి పగిదిం నేఁడొక్కజాణైన ల
క్ష్మీనారాయణ! యింక నీ భువనరాజీవాక్షి మెప్పించునా? ||

జడ్డుపట్టి పెర్లెక్కి యీగాగస్థమీద
మేలి సరిపీలుపెట్టి సీకాలిజాడ
కీర్తిలతో పెనుగొండ యెక్కించె నేను
నాకవనలక్ష్మి గనుము రత్నాలతోంద్రి॥

౧౪

సీ నాకొంబయినట్టి వంగడము రాజించంగ పెనుగొండపై
శ్రీనాధుంతా పసిండి పుష్పములతోఁ జెన్నొందగా నిన్నుఁ
శ్రీనారాయణుఁ జేసెః నాకవనరాజీనాత్రి కెంజాయతో
నే నిప్పింతు సఖా! జయాశిషములన్నీ నీవు గుప్పించుచున్॥

౧౫

నాయకులైన వాంధ్రము భువనాలకుఁ బ్రాణములైరి హాయిగా
నాయుగ రాజ్యలక్ష్మి చరణాలకు మేలిమియైన దివ్య దీ
ప్తాయువు పోయు నాయకుఁడవై, పెనుగొండకు నెక్కె లక్ష్మి నా
రాయణ శ్రేష్ఠి! కైకొనుము ప్రామినుకుల్ వారసాని కట్నముల్॥

వేదాంతకవి:
కవితా సంస్థానం,
బెజవాడ: 10-5-1948

ఈ నాటకంలో దిగుతున్న

## —♦ ప్రధాన పాత్రధారులు ♦—



మహారాజశ్రీ—మహా తెలంగాన్ మహాజన నాయకుడు. ఈపాత్ర నిర్వహించేవారికి పురుష శారీరం ముఖ్యంగావుండాలి. మంచి వర్చస్విగావుండాలి.

కోటారెడ్డి—కథానాయకుడు; ఆజానుబాహుడు; కాస్తపాట పాడగలవాడుగా వుండాలి.

గొల్లసుబ్బడు—నాటకానికి వన్నె తెచ్చేవాడు; చమత్కారి.

మీరాసాహెబు—గడుసరిగావుండాలి.

దేశముఖ్—పెద్ద పర్సనాల్టీగలవాడుగా వుండాలి.

రజ్వీ—ఆజానుబాహుడుగా వుండాలి.

నవాబ్—సౌందర్యంగలవాడుగా వుండాలి.

రుద్రమ్మ—సౌందర్యం పాట బాగావుండాలి; కథానాయకురాలు.

రామి—ఒకమోస్తరు పాటగలవారుగా ఉండాలి.

త్యాగమ్మ—ఒకమోస్తరు పాటగలవారుగా ఉండాలి.

ఇంకా, ఈ నాటకం మధ్యలో వచ్చేపాత్రల్ని సందర్భానుసారంగా ప్రాంప్టింగిస్తున్నవాళ్ళు తెరచాటునుంచి చెప్పొచ్చు. కొన్నికొందరు వేషాలుమార్చుకొని నిర్వహించవచ్చు. రంగస్థలాల్ని గుర్తించి నటీనటులు, వారివారి పాత్రల్ని పోషించుకోవాలి. రంగాల్ని కూడా చక్కగా అలంకరించుకోవాలి.

# చలో హైద్రాబాద్

## ప్రథమాంకం

### ఒకటోరంగం — పొలం

(గొల్లసుబ్బడు — దుప్పటి తలగుడ్డ చుట్టుకొని, వెండి కడియాలు చేతులకు తొడుక్కొని, బొర్రమీసం పెట్టుకొని, మాసిపోయిన గెడ్డంపెట్టుకొని, పొడుగాటి కర్రకి ఒకవైపున గొంగళి వేసుకొని, ఇంకొకవైపున చద్దిమూటా పాలముంతా కట్టుకొని, రేలాల ఆకుతో చుట్టిన చుట్టను చేత్తో పట్టుకొని, కట్టుకొన్న బట్ట గజ్జల్లోకి దోపుకొని, పొలంలో పడుకొన్న గొర్రెమంద చుట్టూతా కీర్తన పాడుతూ గొల్ల సుబ్బడు ప్రవేశం. కూడా గొర్రెల్ని కాచే కుక్కని వెంటపెట్టుకొంటాడు.)

— కీర్తన —

గొల్లసుబ్బడు—గొర్రెమందా యెంట గొల్లోడు వుంటేనె
మంటిగడ్డాపండి మానిక్కెమౌతాది ॥గొర్రె॥
టుర్...బే.....టుర్...బే......

గొపొప్పోళ్ళ సదువేమి కోండర్రి సాలుకురాదు
గొర్రెమందా పడక కోటికే పడగెత్తు
టుర్...బే......టుర్...బే......

(దూకుడుగా దేశముఖ్ నిగామానైన మీరా ప్రవేశిస్తాడు)

మీరా—క్యారే సుబ్బా! (సుబ్బడు ఉలిక్కిపడతాడు)
హరె! క్యాకూరే! నీకీ ఉలిక్కిపడ్డావ్?

సుబ్బడు—ఏందయ్యా సాయబయ్యా! ఎప్పుడు సూసినా పిడుగల్లే హిర్సుకుపడ్తుంటావ్?

మీరా—హరె! నీకీమల్లే మన్మూ ధిన్నా పాముగా ఫడీహుండాలా? నీకీ మొన్న నాకీ సెప్పింది మర్సిపోయినావ్ బే?

సుబ్బడు—ఏంది నువ్వు సెప్పిందీ, నాను మర్సిందీ?

మీరా—హరె! నీకి వహాళ్ళూ బల్సీ కొట్టుకొంటుండావ్ కన్కనే మేరామాటా మర్సావ్. చలో దేవిడీకి! (అని దూకుడుగా పడుకొన్న గొఱ్ఱెమందని లేవగొట్టి తోలుకొని పోతుండగా)

సుబ్బడు—(వెంటపడి) సాల్లే సాయబయ్య శానాతనం! ఇదిగిద్దో సెప్తుండ ఆగు. మందని లెగ్గొట్టక! లెగ్గొట్టక! (గొఱ్ఱెల్ని అదలిస్తూ) టుర్...బే...టుర్...బే...! ఇశ్శ్...ఇశ్శ్ ఇశ్శ్...దూ...చ్చ్...చ్చ్...చ్చ్...చ్చ్...టుర్... టుర్...టుర్...ఆసి మాయిదారిమంద పారైపోనూ. అల్ల రావుడూ! అదిగదిగదిగో! నిగామానుగాడు యముడల్లే వొచ్చి తోలుకుపోతుండడు. అడ్డుపడు! అడ్డుపడు! అయ్యో నీమంద కూలిపోనూ! టుర్...టుర్...టుర్రే!..,అందుకే అంటుంద్రు. తలొంచుకొని ఒకటేపోత పోతుండోళ్ళని గొఱ్ఱె మందలని. ఆసి నిన్ను తోడేలేసుకుపోనూ, టుర్...బే... (అంటూ గొఱ్ఱెల్ని తోలుకొంటూపోయి నిష్క్రమిస్తాడు)

(చుట్ట కాల్చుకొంటూ కోటారెడ్డి ప్రవేశం)

కోటారెడ్డి—ఒరేయ్ సుబ్బా! ఓరిసుబ్బా! నిన్నివాళ ఉత్తర పొలములో మందని మల్లేయమని చెప్పలేదట్రా? అటుకాడికి తోలుకుపోతున్నావురా? అరి నిన్నేన్రోయ్! ఓరిసుబ్బిగా

(గొల్లసుబ్బడు ప్రవేశం)

సుబ్బడు—సందండి రెడ్డిగోరూ!

కోటా—అకెక్కడికి తోలుకుపోతున్నావురా మందని?

సుబ్బడు—మాకన్నిదాలా సావొచ్చిపడ్డదండె!

కోటా—ఏంట్రాదీ? మందనెక్కడికి మళ్లేసుకుపోతున్నావూ అంట?

సుబ్బడు—ఏంసేయమన్నారుండే! దొరగోరితో సావొచ్చిపడుతుండది.

కోటా—దొరగారెవర్రా?

సుబ్బడు—ఇంకోరెవరుంద్రండీ? మనూరి దేశముఖ్ బాబుగోరే?

కోటా—మందని తోలుకురమ్మన్నాడా యేమిటి?

సుబ్బడు—అవునండిసామీ! యింతకుముంగలే నిగామాను సాయబయ్యగోరు యేణ్ణుంచో తోడేలల్లే దూకిపడి మందనికాత్తా సిందరవందరసేసి తోలుకుపోతుండడు.

కోటా—యేడిరా సాయబయ్య?

సుబ్బడు—(చూపిస్తూ) అల్లరిగోనుండే! తోడేలల్లేపరిగెత్తుతుండడు. వుండండి కూత్త దొరా. మందనికాత్తా పొట్టబెట్టుకుంటుండడు.

(అని పరుగెత్తుతాడు)

(సుబ్బడి భార్య రామి పాలుపితుక్కుపోవటంకోసంవచ్చి గొఱ్ఱెమందా గొల్లసుబ్బడూ కనిపించక కోటారెడ్డిని అడుగుతుంది)

రామి—యేంది రెడ్డిగోరూ! మాగొల్లోడియాల మందని యీపొలంలో పండబెట్టలేదాయేం బాబు!

కోటా—నీవుకూడా వచ్చావ్? నీ గొల్లాణ్ణీ, నీగొఱ్ఱెమందనీకూడా బ్రతకనిచ్చే ప్రభుత్వంలేదు. అడుగో! నిగామాన్ మీరా సేవిడ్డికి నీగొల్లాణ్ణీ గొఱ్ఱెమందనీ తోలుకుపోతున్నాడు.

రామి—అయ్యో రెడ్డిబాబో! నిన్న నేసెప్పేంది గొల్లోడూ మీరూ యినకపోయినారుగండండి?

కోటా—అవును. ఇవాళే యింతనిలయం విరచుకుపడుతుందని ఎవరను కొన్నారు కానీ! తోలుకుపోనీ! గొడ్డుబలి స్తేగాని కసాయి దుకాణానికి రానట్టు కొంపటుమంచిన పాపిష్టిముల్లైతో బలిసి కొట్టుకొంటున్న యీ దేవిడీ దొంగగాళ్లకూడా మహా విలయంలో పడకమానరు. వోపికపట్టాలిమనం. లెవీ కట్టాలిట లెవీ! ఈవిధంగా లేవిడీఅవుతున్న దేవిడీలకి లెవీ కడుతుంటే మాత్రం ప్రయోజనమేముంటుంది. ఈ మాదిరి ప్రజల్ని చంపుకొనితినే రాక్షసుల్ని పెట్టుకొనే నైజాంనవాబు కోట్లుగడించి, పొదించి, కన్నుమిన్ను కానరాకుండావున్నాడు.

రామి—అయ్యో రెడ్డిగోరూ! ఇయ్యాల దొరగోరి దేవిడీలో మా గొల్లోణ్ణి కొట్టి సంపుతారేమో కూడా!

కోటా—నీగొల్లాడి వొంటిమీద దెబ్బేపడింగా....ఇదిగో యీ దేవిడీలన్నీ యివాల్టితో నట్టనడి సముద్రంలో కిలిశాయన్నమాటే; నీగొల్లాడి ప్రాణానికేం ఫర్వాలేదు. మన స్టేట్ కాంగ్రెస్ వారు బుర్రకథ వినిపిస్తున్నది యెందుకో తెలుసుకొన్నావా? యీమాయదారి నైజాం ప్రభుత్వంలోంచి నుసమంతా బయటపడటానికే! తెలిసిందా? ఇవాల్టినుంచి మీగొల్లగూడెంవాళ్ళూ మావాడల్లో వాళ్ళూ కలసి, యేకమై స్టేట్ కాంగ్రెస్ వారి ఆజ్ఞ తీసుకొని చేయాల్సిందేదో చేద్దాంపద.

(నిష్క్రమిస్తారు. తెరపడును)



## రెండో రంగం — దేశముఖ్ దేవిడీ

(గొల్లసుబ్బణ్ణి స్థంబానికి కట్టేస్తారు. మీరా కొరడా పుచ్చుకొని పక్కన నిలబడి వుంటాడు. ఒక నౌకరు దేశముఖ్‌కి తమల పాకులు యీనెలుతీసి చేతికందిస్తూంటాడు. సిగరెట్టు తీసియిచ్చి నిప్పుల పెట్టెగీచి ముట్టిస్తూంటాడు. కాలికిబూట్లు తొడుగుతుం టాడు తమల పాకులు నములుకొంటూ, సిగరెట్టు త్రాగుతూ దేశముఖ్ గొల్లసుబ్బడివంక తీవ్రంగా చూచి)

దేశముఖ్—ఏమిరా! అంత వొళ్లుబలిసి కొట్టు కొంటున్నావా?

సుబ్బడు—నేనేమీయెరగను దొరగోరూ!

దేశ—యేమీయెరుగనంటావేం? మాదచ్ఛోద్! నీవుయివాళ యెవరి పొలంలో యెరువు కడుతున్నావురా?

సుబ్బడు—కోటారెడ్డిగారి పొలంలో నుండె!

దేశ—ఐతే, దివాణం పొలంలో చివరికి కడబామనుకొన్నావన్న మాట

సుబ్బడు—లేదుబాబో! ముందస్తిగానే తమదేవిడీ పొలంలో కడదా మనిపోతే, సేలో పెసరా మినుమూ పైరుందని, వీల్లేదని నిగామాను సెప్పాడయ్యా!

దేశ—యేం మీరా! వాడుచెప్పింది నిజమేనా?

మీరా—యేబాత్ ఝూట్ హై రాజాసాబ్.

సుబ్బడు—అట్టాగంటే యెట్టాసాయబయ్యా! నీవు సెప్పావు కనకనే మందని రెడ్డిగారి పొలంలోకి తోలుకుపోయా!

దేశ—ఒరేయ్! ఆట్టేవాక్క, నోరుముయ్! కొవ్వెక్కి కొట్టుకుంటు న్నావా? ఏయ్ మీరా! వీడివొళ్ళు పగిలేటట్టు కొట్టు వీళ్ళంతా బుర్రకథలు చెప్పించుకొని కళ్ళుతిరిగి, బుర్రలు తిరిగి మదించి కొట్టుకొంటున్నారు. లెవీకూడా కట్టకుండా ఎగ్గొడదామని సభలు జరుపుతున్నారట.

సుబ్బడు——లేదండి బాబో! మేమేమెరుగం. నేను సెల్లించే లెవీ అంతా మునుపే సెల్లించుకొండానండి.

దేశ——ఒరే బద్మాష్ చుప్‌రహో, ఏయ్‌మీరా మారో.

(దేశముఖ్ నిష్క్రమిస్తాడు)

(రామి ప్రవేశం)

రామి——అదేంటి సాయబయ్యా! గొడ్డును కట్టేసినట్టు కట్టేశారు?

మీరా——కట్టెహెయ్యాలా-సావగొట్టాలా? నీకీకూడా మూడిందే, జావ్.

రామి——ఇట్టా నోరులేనోళ్ళని పట్టి, సంపుకొసి తింటే మీ క్కేటొస్తది సాయబయ్యా!

సుబ్బడు——యేమొత్తదా? కావల్సినంత అయిచ్చర్యాలురాత్తె.

మీరా——అరే చుప్‌రహో! (కొరడా తీసుకొని బాదును)

రామి——అయ్యొ అయ్యో! పానంకూడా తీత్తావాయేం సాయబయ్యా?

మీరా——నీదీ మల్లిజన్మంఖాదుటే? పానంకీ తీయాలా-కోసి శాకుల్కి హేయాలా?

సుబ్బడు——మా పేదోళ్ళందత్నీ మీరూ మీ దేవిడీలూ పొట్టల్ని పెట్టుకోండి బాబో!

మీరా——హేమ్మీబే తెగ నీల్గుతావ్ నీకీ. (కొరడాతో బాత్తుంటాడు)

రామి——అయ్యో! అయ్యో! దొరగోరూ! యీడ మా పానాలు తీత్తుండడు. రాండి దొరగోరూ! (మహారాజశ్రీ ప్రవేశం)

మహారాజశ్రీ——ఏమిటి! ఈ అన్యాయం? చిత్రవధ! కొట్టకొట్టక!

రామి——(కాళ్ళమీద వచ్చి పడి) బాబో! మా పేదోళ్ళ పానాలకి దేవుడల్లె వొచ్చావా బాబో! మేమే అన్నెం పున్నెం యెరగం బాబో!

మీరా—తూకౌన్‌రే? నీకీ హేదాంతం సెప్తుండావ్!

మహా— నేనెవణ్ణైతే నీకేం? నీవుకూడా మావంటి వాడివే. తప్పుంటే యింకోవిధంగా శిక్షించాలి గాని, ఇదేమిటి? ఈనవ నాగరిక ప్రపంచంలో సాటిమానవుణ్ణి గొడ్డును కట్టేసినట్టు కట్టేసి బాదటం ధర్మమేనా? ఇదా యిన్నాళ్లినుంచీ మీ దేశముఖులు దేవిడీలు, నైజాంరాజ్యంలో నడిపిస్తున్న ధర్మ పరిపాలన!

మీరా—నీకీ హాట్లేమాటల్ రానీయక! సర్కార్కీ ఉత్తర్ పకారం మాక్కీసేత్తుండాం. నీకీ హెవడ్కీ హాడ్గటానీక్? (సుబ్బణ్ణిమళ్లీ బాదబోవును)

సుబ్బడు—బాబో! అబ్బో! (గావుకేక పెట్టును)

మహా—(అడ్డంపోయి) నిలుసాహెబు!(చెయ్యిపట్టుకొనును)

మీరా—(విడిపించుకొనబోయి) నీకీ సెప్తుంటే తూ నైసునా? జావో,
(చెయ్యి విదళించుకొనును)

మహా—(మళ్లీ గట్టిగాపట్టుకొని) నాబొందిలో ప్రాణంవుండేవరకు యిటువంటి చిత్రవధల్ని జరుగనీయను. నిరంకుశరాక్షస పరి పాలన సాగనీయను. ధనమదాంధులైన నిరంకుశ భూపాల కుల మోచేతిగంజిత్రాగి నాబంగారు తెనుగుతండ్రుల్ని చంపి మీ నైజాం బకాసురుని బలిపించదలచుకొన్నారా? ఇహ ఆ ఫాలాక్షుడుఅడ్డువచ్చినా మీ ఘోరకిరాతక చిత్ర వధల్ని సాగనీయను.

మీరా—హేమ్టిటాబే? (అని బలవంతంగా చెయ్యి విదళించుకొని దూకుడుగా దివాణంలోకి పోతాడు)

మహా—(తన పేష్కత్తితీసి సుబ్బణ్ణి కట్టేసిన బంధనాలు కోయటానికి దగ్గరకుపోగా)

సుబ్బడు—బాబో! నీకాలుమొక్కుతా. గొంతుపిసిగన్నా సంపేయ్.

మహా—మాట్లాడక! నిన్ను పొడవటానిగ్గాదు వచ్చింది. నిన్ను విడిపించటానికి వచ్చాను. (అని బంధనాలు చకచకకోసి విడిపించుకొని రామిని, సుబ్బణ్ణి వెంటబెట్టుకొని తానెక్కివచ్చిన గుర్రం మీాద పారిపోతాడు)

(మీారా దూకుడుగా ప్రవేశం)

మీారా—(అటూ యిటూ చూచి) హాశే! యేరీ హీాల్కిం బలేతమాషాగావుందే! నమ్మక్‌హరాం! నమ్మక్‌హరాం. ఎటుపోయారూ యీాల్కి! రాజాసాబ్! రాజాసాబ్! జల్దీ ఆవో! జల్దీఆవో! సాలాఘోరం హుయ్యాంది.

(అని నిష్క్రమిస్తాడు. తెరపడుతుంది)



# చలో హైద్రాబాద్

## ద్వితీయాంకం

### ఒకటో రంగం—కోటారెడ్డి యిల్లు

(కోటారెడ్డిభార్య రుద్రమ్మ దేవీపూజ చేస్తూ వుంటుంది)

—♦ కీర్తన ♦—

రుద్రమ్మ—దేశము దుఃఖములో దేవీ
తేలెను దిక్కెవరో ॥దేశ॥

ఘోరమైన యీ మృగములలో బడి
జగములు యుగములు ఘోషించెనుగా ॥దేశ॥

మృదు మధుకవితా వాహిని యైనా
మేదిని రక్తపుటేరుగ మారెనుగా
కనికరమున కాపాడుమింక జననీ
మాబంగారు తెనుగుతల్లిని ॥దేశ॥

త్రిలోకైక శక్తిస్వరూపిణీ! దాక్షాయణీ! నీవే మహాజన శక్తివని త్రికరణ శుద్ధిగా నిన్ను నమ్మి నిన్ను గొల్చి మా జీవిత ధర్మాల్ని నీదివ్య సాన్నిధ్యమైన యీ మంజుల మనోహర కళా ప్రపంచమందు ధారవోసి జగజ్జననీ! నీ అవ్యాజ కృపారస తరంగిణీ తరంగ డోలికల్లో వుయ్యాల లూగుతున్న

మేమంతా నీ చంటి బిడ్డలంగామా!

నేడు నీ బంగారు లోగిలిలో తల్లీ! కుల, మత, జాతి, వర్గ పార్టీ ద్వేషరోషాలు వీచి, ఎన్నెన్ని విలయ వికటాట్ట హాసాలు లేచి, నీ పసిడి తూగుటుయ్యాలలో గల యీ పసి కందుల్ని ఎంత దద్దరిల్ల చేస్తున్నవో నీవు చూడటం లేదా? నీయింటికి పట్టిన దురవస్థ, నీ బిడ్డలకి వచ్చిపడ్డ ఘోర చిత్ర వధ నీకంటే చూచుకొను వారెవరున్నారమ్మా!

కొండల గుండె కర్గి పసి
  గ్రుడ్లకటా! సెలయేటి గోలతో
పండక, తల్లిదండ్రికయి
  వాహినియై నలుదిక్కులెక్క, బ్ర
హ్మాండము దద్దరిల్లు ప్రళయాబ్ధిని
  బడ్డవిపత్తుబాపి నీ
దండను తల్లి! మా తెనుగుతల్లి
  వనమ్ము చిగిర్చజేయుమీ.

(ఆదుర్దాగా రామి ప్రవేశం)

రామి—అమ్మా! రుద్రమ్మ గోరూ! ఇంకా యీనిక్కు మాలిన కళ్ళ రాజ్యంలో బతికే దెట్టాగ తల్లీ?

రుద్రమ్మ—ఏమిటిరామీ? మళ్ళీ యేమన్నా ప్రళయం వచ్చి పడ్డదా?

రామి—పెళయం కాకేంతల్లి! మళ్లీ పాపిష్టినూరి తురకమూకొచ్చి మాకొంపలో కుండా, బొచ్చె పగలగొట్టి దాచుకొండ గింజల్ని నేలపాలుసేసి గుడిశె తగలబెట్టిపోయారు.

రుద్రమ్మ—ఏంచేద్దాం! మనం ఆడవాళ్ళం. మనమగవాళ్లు యీ రాక్షస రాజ్యంలో కిరాతకులకి చిక్కకుండా తప్పించుకొని

తిరుగుతున్నారు. దిక్కూమొక్కూ లేనివాళ్ళమైనాం. నీ గొల్లాడిజాడా తెలియలేదుగా!

రామి—తెలియనేదండమ్మా. కోటారెడ్డిగోరూ మాగొల్లోడూకలిసి యేడకో పోయారని తెలిసింది. ఈళ్లిద్దరికి యీ రాచ్చసుల్ని పట్టటం సాధ్యమటమ్మా తల్లీ!

రుద్రమ్మ—నిజమేగాని, ఐతే, నీగొల్లాణ్ణి విడిపించుకొనిపోయిన మహానాయకుడు మహారాజశ్రీగా రెవరోట. చాలాశక్తిసామర్థ్యాలు కలవారట. వారేమన్నా చాటుమాటుగా సిబ్బందిని తయారుచేసి మీరెడ్డిగారికి, గొల్లాడికీ సహాయంచేసి పంపటానికేమన్నా తీసుకుపోయారేమో!

రామి—అంతపున్నెమే ఆమాత్ముడు కట్టుకుంటే మన సెరలన్నీ తప్పిపోయినట్టేగదమ్మా! యీవూళ్లో యీదిక్కుమాలిన కరణపోరి మూలంగానే దేవిడీవోరికి కావలసినంత సాయం పైనుంచి వచ్చిపడుతుండది.

రుద్రమ్మ—యథార్థంగా అంతే. అడవిలో కర్రపోయి ఇనుపగొడ్డల్లో దూరబట్టే, అడవి మొత్తానికి చేటువచ్చిపడ్డది. నీవన్నట్లు యీదిక్కుమాలిన కరణాలమూలంగానేగా మనదేశానికింత తిప్పలొచ్చిపడ్డది. దేశాన్ని నాశనంచేసిపారేసే మహానుభావులు చాలామంది దిగివచ్చారుగాని, పాడైపోతున్న దేశాన్ని బాగుచేసే మహాత్ముడు ఒక్కడూపుట్టలేదు. ఈ మహాజగజ్జననియైన దుర్గామహాదేవికి చల్లనిదయ యెప్పుడు వచ్చి యీ దేశవినాశకులైన నిశాచనిశాచరులని చీల్చి చెండాడగల పురుషసింహుణ్ణి యెప్పుడు ప్రసాదిస్తుందో, అదిగో అప్పుడే మనకష్టాలన్నీ గట్టెక్కినట్టు.

(అని పూలుచల్లి నమస్కారంచేస్తుంది. రామికూడా పూలుచల్లి దణ్ణం పెడుతుంది. ఇంతలో మీరా ప్రవేశం)

(రామి మీరానుచూచి గడగడలాడుతూ నిలబడుతుంది)

రుద్రమ్మ—ఫరవాలేదురామి. భయపడక. ఎవరు నీవు ? ఎవర్నీ అడక్కుండా లోపలికిరావటమేనా ?

మీరా—మేరా రాజాసాబ్ హుకుం హయ్యిందీ కన్కనే హొచ్చాం, కోటా రెడ్డీ కిధర్ హై ? లేఖాపోతే సాలా ఘంటావుంది మీకీ.

రుద్రమ్మ—ఓసహో ! మగవాళ్లు లేనితరుణంచూచి జొరబడటమే కాకుండా మీదిమీదికొచ్చి ప్రేలటంకూడాసాగిస్తున్నావా ? ఇదా, ప్రేలుడు కట్టిపెట్టి వచ్చినదారిబట్టు. ఇది పౌరుషహీనులైన మానవాధముల నుక్కడగించెడి వీరనారీమతల్లులున్న పోతుగడ్డ. తెలిసిందా ?

మీరా—నీకీ సైతాన్ పట్టిందల్లేహుంది. బాత్ గర్ నఖో ! రెడ్డికి జాడా సెప్తేనే నీకీ హిడ్చిపెడ్తా.

(అని మీదికొచ్చి పట్టుకొనబోవును)

రుద్రమ్మ—ఓరి కృాగుడా ! ఒళ్ళు మదించి కొట్టుకొంటున్నావా ? (పక్కకు తొలుగుతుంది)

మీరా—మాకీ కూరున్లైతే నీకీ జెమ్మరాచ్చసివి.

(అని జుట్టు పట్టుకొనబోవును)

రామి—(గావు కేకతో) అయ్యల్లో! ఎవరల్లా! ఈపాపిష్టి తురకోడు.... అమ్మో! అమ్మో!

మీరా—హేమ్టీవే నీకి పేల్తుండావ్?

(చేతిలో పేష్కత్తితీసి రామిని పొడుచును)

రామి—అమ్మో! అమ్మో! ...(అని బాధతో క్రిందపడిపోవును)

రుద్రమ్మ—ఓరి దుష్టుడా! నరహంతకుడా! ఎంతపనికి పాల్పడితివిరా!

(అని తటాలున వీధిలోకి పోతుండగా మీరా జుట్టుపట్టుకొని)

మీరా—హేమ్టీవే సైతాన్! మేరా బాత్ నై సునా?

రుద్రమ్మ—విడిచిపెట్టు ప్రాణ ఘాతకుడా!

మీరా—(నవ్వి)హ్హా హ్హా హ్హా.....నీకీహిడ్చి పెట్టింది నీకి మొఘుడ్! మళ్ళీ నీకీ నిగా కట్టుకొంటూ నాకీ.

రుద్రమ్మ—ఛీ! దుష్టుడా! (అని విదళించుకొన బోవును)

మీరా—అరె! సైతాన్! నీకీ సెప్తుంటా నాది మాట హిన్కా హుంచే నీకీకూడా మూడింది.

రుద్రమ్మ—(పెనుగులాడుతూ) ఓరిపాపిష్టి నరాధముడా! నావంటి ఆడదాని మీదనట్రా నీ ప్రతాపం, పరాక్రమం.

మీరా—ఛుప్ రహో సైతాన్ (అని క్రింద పడేసి కాళ్ళు చేతులు కట్టేసి నోట్లోగుడ్డలు కుక్కి ఒంటినున్న ఆభరణాలు ఒలుచుకొని, ఇంట్లో జొరబడి నలుమూలలా వెదకి పెట్టెలు పగులగొట్టి ధనందోచుకొని పారిపోవును.)

(రుద్రమ్మ అటూ ఇటూ దొర్లుతూ ఉంటుంది.
గొల్లసుబ్బడు ప్రవేశిస్తాడు.)

సుబ్బడు—ఒసే అమ్మో! గుడిశొదిలిపెట్టి ఏడకు పోనావే? కొంప తగలపడతుండా సంగతి సూసుకోకుండా ఏడ కూకుండావే?

యీాడకేమైనా వొచ్చావని సూద్దును గందా - యీాణ్ణు అగుపించకుండా ఏడకి పోనావే! అమ్మగోరూ! రుద్రమ్మ గోరూ! మాగొల్లదొచ్చిందండే?

(అని తారట్లాడుతూ రాగా స్పృహలేక పడిఉన్న రామి, రుద్రమ్మలు కంటికగుపించి)

సుబ్బడు—ఓయి బాబోయ్! (గుండెలు కొట్టుకొంటు) ఇదేకగడి యిలయంరోయ్ దేవుడా!

నాగొల్లదేనే బాబోయ్! యీారకతం యేంటినాయనోయ్! (అనిపడివున్న రుద్రమ్మదగ్గఱకొచ్చి, నోట్లోగుడ్డలుతీసి కట్లు విప్పుతాడు) అయ్యో! అయ్యో! ఓ రుద్రమ్మగోరూ! యీాపెళయం యేంటితల్లీ! అయ్యో! అయ్యో!

(అని యేడుస్తుండగా మీరా దేశముఖ్ లిద్దరూ ప్రవేశిస్తారు)

దేశముఖ్—పట్టుకో మీరా, సుబ్బడి గాడిదకొడుకుని! గాడిదకొడక! తప్పించుకుపోదామని చూస్తున్నావా? పట్టపగలే ఖూనీలు చేసి ఇళ్ళు దోచుకు పోదామని చూస్తున్నావా?

(గొల్లసుబ్బడు తెల్లబోయి, నోరుపడిపోయి, వేలాడతాడు)

(మీరా దేశముఖ్ లిద్దఱూ గొల్లసుబ్బడి చేతులుకట్టేసి లాక్కొనిపోతారు)

రుద్రమ్మ—(కాస్త స్పృహ తెచ్చుకొని) జగజ్జననీ! దిక్కులేని వాళ్ళని జేస్తివా! అబ్బా! దాహం! దాహం! దిక్కులేని నా వంటివాళ్ళని కాపాడగల దయారస సముద్రుడులేడా? అయ్యో! జగజ్జననీ! దాక్షాయణీ! (లేచికూర్చొని) నీకు

కూడా దయారసం కరువాయెనా? (రామికి వుపచారం చేస్తూ)పాపం! పతి దగ్గఱలేక నానాచిక్కుల్లో పడి, దిక్కు- మొక్కు- కనిపిస్తుందేమోనని నా గుమ్మానికొచ్చిపడ్డ రామి ప్రాణాలు పోయి నావంటి జీవచ్ఛవాన్ని యీకిరాతకుల మొహాన పడేసిపోయింది. రామీ! నీకెంతవిపత్తువచ్చి విలయకాలంలో కలసి కరగిపోయినావే! నీ గొల్లవాడికి నిన్నుగుఱించి నేనేమిచెప్పేది. అయ్యో! జగజ్జననీ! దుర్గా భవానీ! నిన్నునమ్ముకొన్నవాళ్ళకి ఎటువంటి విపరీత విప త్కాలం తెచ్చిపెట్టి దేశాన్ని నట్టనడి సముద్రాన పడద్రో స్తున్నావమ్మా! (విరబోసుకొన్న జుట్టుతో లేచి) నీవు మహి షాసుర మర్దనివా లేక పనికిమాలిన బిరుదాంకితరాలవై మనుష్యలోకంలో మాయగాతిరుగుతున్న మాయలాడివా? ఎక్కడ నీదుష్టసంహారశక్తి అడుగంటెనమ్మా? నీకుకూడా యీ పాపిష్టి నిరంకుశరాజ ధనికలోకంలో పైకంమీద మనసుపుట్టి మైకంకమ్మెనా? నిన్ను నిరంతర నిర్మల భక్తి సుధాంజలితో, మందార మకరంద మంజుల కవితాగాన తరంగిణీ తరంగాలతో సేవించి పూజించి జీవిస్తున్న నీభక్త కోటిమీద, నీ జగదాధార నిర్వాహకులమీద నీకెంత కార్ప ణ్యాం, నిర్దాక్షిణ్యాం తగునటమ్మా!

త్రిలోకైక శక్తి స్వరూపిణీ! దుర్గాభవానీ! అవును. ఎన్ని మొఱలుపెట్టుకొన్నా మిన్నకుండా, కన్నువిప్పకుండా, కనికరించకుండా కఠిన పాషాణాలైవున్న నీకొడుకులంతా బ్రిటిషుబ్రాల దిగజారిన రాండోలు పొట్టగాళ్లై, వివేకశూ న్యులైన వినాయకులై, నీ పతితపావన చరిత్ర ధరిత్రిని మం టగలిపి, మసిజేసి, మహాభయంకర పిశాచ నిశాచర నిశీధి

లోకంలో కలిపిపారేస్తుండటం నీకుగిట్టికాబోలు ! నీవుకూడా చలించని చట్టుబండవై వున్నావు. నీవు వలిమల పట్టివై యున్నందువల్లనే నీవంశప్రతిష్ట నీరుకారి మున్నీటిలో కలిసినది

(అని పూజాద్రివ్యములున్న పళ్లెంతీసుకొని కొట్టును)

ననుగన్నతల్లీ ! జగన్మాతా ! మేమునీకేమి అపరాధం చేశామని యీభయంకర రాక్షసులకువొప్పజెప్పితివమ్మా ! దయలేదా ! హృదయంకరుగలేదా ! దుష్టులను శిక్షించ లేవా ! మొరలను వినిపించుకోలేవా ! జగజ్జననీ !

(రామి కొంచెం స్పృహవచ్చిలేవగా రుద్రమ్మ రామిని చేతోపట్టుకొని కీర్తన పాడుకొంటూ వీధి వసారాలోకి వెళ్తుంది)

—♦ కీ ర్త న ♦—

చల్లారని శౌర్యం మాది
ముల్లోకం వుడికించేది
ఇంటికి పట్టిన దయ్యానింకా
గెంటేటందుకు పుట్టామోయ్

... ... ... ... ...

(నిష్క్రమిస్తారు. తెరపడును)

## రెండో రంగం — వీధి వసారా

(రుద్రమ్మ రామినితీసుకొని తనముందు మెల్లగా పరుండబెట్టుచుండగా స్టేట్ కాంగ్రెస్ రామారావు ప్రవేశం)

రామారావు— (ఆశ్చర్యచకితుడై) ఇదేమిఘోరమమ్మా ! ఇంత ఆగ్రహానికి కారణం యేమిటి ?

(రు)ద్రమ్మ—(రామారావుమాట వినిపించుకోకుండా)

ఘనతన్ జెందిన లోకమున్ నిజ
భుజస్కంధాలపై మోయుచుం
డిన నిర్భాగ్యపు కష్టజీవులను
కాఠిన్యంబుగా నేడు మా
డ్చి నిధుల్ నింపి కుబేరుడైన ధన
రాజీవాక్షు డొక్కండు కో
ల్చినచో నీపతి, నీవు మెత్తురె !
కటాక్షింపన్ మహా భైరవీ !

రామా—రుద్రమ్మగారూ! నాకేమీ అర్థంకావటంలేదు.(రామినిచూచి) అయ్యో! యీ పడిపోయిన వారెవరు? ఈ రక్తమేమిటి?

రుద్రమ్మ—ఇది, ఈ మహా కాళికా శక్తికి జాతర!

రామా—ఈ నవ నాగరిక యుగంలో కూడా కాళికాశక్తి నరబలుల్ని కోరుతున్నదా !

రుద్రమ్మ—ఈ నైజాంరాజ్యం నరబలుల్ని కోరుతున్న కాళికా శక్తి రూపం ధరించింది.

రామా—ఈపాపిష్టి కిరాతకులు, నరహంతకులు నిరపరాధులైన ఆడ వాళ్ళపై గూడా పడి అమానుషంగా ఎంతెంత చిత్రవధల్ని చేస్తున్నారో! (చెవులుమూసుకొని) శివశివా! లోకంలో ధర్మబలం తగింది కాబోలు. లేకుంటే నరపాలకులకి యిట్లా మనుజమాంసం తినమరగటం పుట్టేదికాదు. రుద్రమ్మగారూ! ఇవా, మీరుకూడా స్టేట్ కాంగ్రెస్ మహిళా ప్రపంచానికి నాయకత్వం వహించి నడుం కడితేగాని మిగతా వీరనారీ

లోకం అహింసా వజ్ర కవచధారిణులై యీభయంకర సంగ్రామ భూమికి దూకి శత్రుసంహారంచేసి ధర్మసంస్థాపనానికి దిగదు.

రుద్రమ్మ—మీరు చెబుతున్నది సమంజసంగా వున్నప్పటికీ ప్రస్తుతం నిరంకుశ పశుబల నిజాం బకాసురుడి మీద దండెత్తటానికి కేవలం మీ స్టేట్ కాంగ్రెసువారి బలసన్నాహాలు చాలవు. నిజాంకోటీశ్వరుణ్ణి, నిజాం ఇత్తేహాదులైన మత్తేభాల్ని జయింపజాలరు. ప్రస్తుతం యీ నిజాంరాజ్యంలో దేశముఖుల అనుపమాన సహకార బలాలతో మదించిపోయిన నిరంకుశనిజాంరాక్షసిని స్టేట్ కాంగ్రెసు వారొక్కరూ జయించటం దుర్ఘటం, దుర్లభం.

రామా—పిచ్చితల్లీ! స్టేట్ కాంగ్రెస్ బలం నీరసమైనదని, బలహీనమైనదని భావించబోక. రవియస్తమించని బ్రిటీషు సామ్రాజ్య బలపరాక్రమసింహాన్ని నిరాయుధులై, అసహాయశూరులై నిర్జించిన అఖిలభారతకాంగ్రెసు మహాసంస్థ చక్రధారులైన మహాత్ములవారి తపోనిష్ఠాగరిష్ఠతతో నిలబెట్టిన అశోక ధర్మచక్ర పతాకం పట్టుకొన్న నెహ్రూ పటేళ్లు, అజాద్ రాజేంద్ర బాబులు, రంగా రామానందులు, పట్టాభి ప్రకాశములు అజేయులై వున్నప్పుడు స్టేటుకాంగ్రెసు కొచ్చిన కొరతయేమిటి?

రుద్రమ్మ—పరాధీనమై, అస్వతంత్రమై, పడివుండటమే మీ స్టేటుకాంగ్రెసు బలహీనత చాటుతున్నది స్వామీ. మీ స్టేటుకాంగ్రెసుకీ మిగతా పార్టీలవాళ్ళనికూడ నెట్టుకోగల సామర్థ్యం

కోయిపోవటంవల్ల యీనాటి నిరంకుశ నిజాంరాక్షససైనికుల్ని ఎదుర్కోలేరని తోస్తున్నది. నిజంగా ఎదుర్కోగల శక్తి సామర్థ్యాలు మీ స్టేటుకాంగ్రెసు కున్నట్లయితే యీనిరంకుశ నిజాం పశుబల ప్రయోగాలకి గ్రామగ్రామా లిట్లా సర్వ నాశనమై పోయేవికావు.

రామ—శాస్త్రీ! ప్రజాగౌరవంలేని పార్టీల్ని కూడగట్టుకొన్నందు వల్ల ప్రయోజనం లేకపోగా ప్రమాదం రాకపోదు. ఈనాడు ఒక్క ప్రజాగౌరవం అఖండంగా సంపాదించుకొన్న స్టేటు కాంగ్రెసుబలం మరేపార్టీకీ లేదు.

(కామ్రేడ్ శివరావు ప్రవేశము)

శివరావు—ఏమండీ రుద్రమ్మగారూ! మనగొల్లసుబ్బణ్ణి దేశముఖులు పట్టుకుపోయి కోటా రెడ్డిగారి జాడా చెప్పమని నానా హింసలు పెడుతున్నారట. పాపం! ఆ అమాయక పెరిగొల్లవాడొక్కడూ కొంపా గోడూ పోయి మనదేశంకోసం ఎంత బాధ పడుతున్నాడండీ?

రుద్రమ్మ—ఔను దేశంకోసం పార్టీ భేదాల్లేకుండా యెవరూ పాటు పడకపోతే మరి మావంటివాళ్ళగతు లెవరు చూస్తారు?

శివ—నిజంగా సక్రమమైన పంథాపట్టి నడుస్తున్న పార్టీ ఒక్కటికూడా లేకపోబట్టే దేశం చీలిక పేలికలైనట్టు పార్టీలనేకం లేవ వలసి వస్తున్నై. ఎన్ని పార్టీలూ, ఎన్ని కులమత వర్గాలూ, ఎన్ని భాషా సాంప్రదాయాలూ ఉన్నప్పటికీ ఒక్క సోవియట్ రష్యా పతాకం తన సామ్యవాద రాజకీయ చాతుర్యంతో మిగతా వాటిసన్నింటినీ కూడగట్టుకొని ప్రపంచ

కష్టజీవులకి మార్గదర్శనీయమైన పంథా త్రోక్కి జగద్విఖ్యాతితో ప్రకాశిస్తున్నది.

రుద్రమ్మ—అది నిజమేగాని, ఐతే సోవియట్ రష్యా పంథా తిన్నగా మీకు కనిపించక పోవటం మూలానే మీ కమ్యూనిష్టు పార్టీ వారు మిగతా పార్టీల్ని కూడగట్టుకో లేకపోతున్నారు. అంచేత మిగతా పార్టీల పరపతి మీ భారత కమ్యూనిష్టు పార్టీవారు సంపాదించుకో లేక పోవటంమూలాన తమస్వచ్ఛమైన, జగజ్జేగీయమానమైన, సామ్యవాద రథ సారధ్యం యీ దేశంలో యీనాడు అప్రతిహతంగా సాగించ లేక పోతున్నారు. కేవలం పార్టీ భేదంతో యీ మాదిరిగా ఉన్న మిమ్మల్ని నమ్ముకొంటే యీ తెలంగాణం నిరంకుశ నిజాం రావణాసురుని చేతుల్లోంచి తప్పించుకొని ఎట్లా బయట పడ గలదు ?

(ఆంధ్ర మహాసభా నాయకుడు కేశవరావు ప్రవేశం)

కేశవరావు—రుద్రమ్మగారూ! చాలా ఘోరకలి జరిగిందని విన్నాం.

రుద్రమ్మ—ఓహో! మీరుకూడా వచ్చారూ ? మీ ఆంధ్రమహాసభ వారిగ్గూడా చేయిదాటిపోయిన ఘోరదురవస్థల్లో తెలంగాణం 90 లక్షల ప్రజలు పడిపోవలసివచ్చింది.

కేశ—మా ఆంధ్రమహాసభకి చేయిదాటిపోయింది మరేదీలేదు. తెలంగాణం 90 లక్షల ప్రజానీకం పడుతున్న పాట్లకోసం అహర్నిశం ఆందోళనచేస్తున్నాం. ఆధారాలకి ఆలోచిస్తున్నాం. మీకేమీ ఫరవాలేదు. ఆంధ్రమహాసభకి అడ్డువచ్చేవారెవరూ లేరు.

రుద్రమ్మ—మీ ఆంధ్రమహాసభవారసలు తిన్నదిలెక్కతోసడవక పోవటం వల్ల యీనాటికిగూడా రాష్ట్రసిద్ధిలేక నలుగురిలో తలయెత్తి తిరుగలేక పోతున్నారు. ప్రస్తుతం మీ ఆంధ్రమహాసభవారెట్లా నిజాం నిరంకుశుణ్ణి జయిస్తారో తోచకుండావుంది.

(చినిగిపోయి, మాసిపోయిన చింపిరిగుడ్డలతో పిచ్చివాడిమాదిరి మహా రాజశ్రీ వీరగేయాలు పాడుకొంటూ శిష్యులతో ప్రవేశిస్తాడు.)

—♦ కీర్తన ♦—

చలో చలో నిజాముకీ
మహా తెలంగ కేసరీ
ఇత్తెహాదులింకా మదేభంబులాయెరా ॥చలో॥
త్వదీయ శౌర్య ధైర్యముల్
దూకించరా సహోదరా
ముల్లోకముల్ నుతించగా
కల్లోలముల్ గతించగా ॥చలో॥
భూనభంబు నిండా ప్రతాపంబు నింపగా
పరాక్రమంబు చూపరా
చల్లారిపోని రోషముల్
సత్కీర్తి వెండి కెరటముల్
వర్షించరా సహోదరా ॥చలో॥
ఇంతకండ్లుపూడిన కుబేరుండు వున్నచో
స్వరాజ్యమన్న దుండునా
స్వేచ్ఛా సుఖాలు దక్కునా
పేదోళ్ళవంక చూచునా

చావంటే భయ మికేలరా ॥చలో॥
ధర్మచక్రముండిన జెండానుకట్టగా
నిజాము కోట పట్టరా
ముక్కోటి నుతులు యేలగా
దిక్కాంతలెల్ల కొల్వగా
జై హింద్ మహా తెలంగతో ॥చలో॥

జైహింద్ మహా తెలంగాన్! క్విట్ మహా తెలంగాన్!
చలో హైద్రాబాద! బోలో మహా తెలంగాన్ జిందాబాద్!

మహాజనులారా! మనమంతా మహా ప్రళయరాక్షసిని యెదుర్కోబోతున్నాం. మహామారణ యంత్రానికి బుద్ధి చెప్పబోతున్నాం. మనదేశం మనస్వాధీనమైనప్పుడు మన మంతా గర్వించాలి గాని నేడుకూడా మనదేశాన్ని పరాధీనంజేసి, మన వీరభాగత దేశంలపరాక్రమపౌరుషాల్ని నీరసం చేసి, లేనిపోని కక్షలతో కుల, మత, జాతి, వర్గ, పార్టీల్ని లేవదీసి రత్నగర్భవంటి దేశాన్ని నిరంకశ నిజాంబాకాసురుల పొట్టపెడుతున్నాం. ముందు మనమంతా పూర్వాభిమానాలు మరచి తమతమ పార్టీల్నె పోషించుకోవటం బాగా నేర్పిన నాయకులందర్ని యేకంజేసి, నడుంకట్టి తెలంగాణం 8 జిల్లాల్లో వున్న 90 లక్షల మన తెలుగుభాషాదేశీయుల్ని, రాయలసీమలో వున్న మన తెలుగుదేశ వీరపరాక్రమ కళాసార్వభౌముల్ని, మిగతా మద్రాసునుంచి, నెల్లూరునుంచి, గుంటూరు, కృష్ణా, గోదావరి, విశాఖపట్నం, కోరాపుట్టి, గంజాం, బస్తర్ జిల్లాలనుంచి, అద్వితీయంగా, అప్రతిహతంగా అనుపమాన మేధాసముద్రులై, అనివార్య కార్య శౌర్య

రణధురీణులై భుజాస్ఫాలనంచేసి, వీరభ్రాంత కథాసుధారస ప్రవాహాలు పెన్నా తుంగభద్రలుగా, కృష్ణాగోదావరీ నదులుగా ప్రవహింపజేసి, జగజ్జేగీయమానంగా, దిగ్దిగంతరాళాలు, భూనభోంతరాళాలు మారుమ్రోగిస్తున్న మన ముక్కోటి తెలుగు దేవతల వజ్రసంకల్పంతో, కార్యశూరత్వంతో నిజాంకోట పట్టుకోవాలి. దేశగౌరవం నిలబెట్టుకోవాలి.ఇండియన్ యూనియన్ నెహ్రూ కేబినెట్ సింహాసనం అధిష్ఠించాలి.

భగవత్స్మృతిరాజ్యం, యూనివర్సల్ పంచాయతీ, స్వతంత్ర స్వారాజ్యం ప్రతిష్ఠించాలి. కరువు రాక్షసిని చీల్చిచెండాడాలి. సోమరిపోతుల్ని, త్రాగుబోతుల్ని, దుర్గుణదుష్టభూయిష్ఠమైన దుర్వ్యసనాలనుంచి గాంధిమహాత్ముని తపస్సుపండించి బందిఖాన ప్రపంచానికి బంధవిముక్తిచేయించి. నవాబుల్ని, పరాబుల్ని, శరాబుల్ని జేసి,జగజ్జనసిక ప్టాలన్నిగట్టెక్కించాలి.

తెలుగుతల్లులారా? తెలుగుతండ్రులారా! యీనాడు మన దేశంమీద విరుచుకుపడ్డ ఇత్తేహాదుల్ మత్తేభాల్ని అమాయక నిజాంనవాబు దగ్గఱ్నుంచి తొలగించి, హిందూ-ముస్లిం సమైక్యతతో మన భద్రాద్రి రామభక్తపరాయణుడైన మన నిజాంనవాబుని మనముక్కోటి తెలుగుదేవతలంతా కలుపుకొని, విన్నూత్న ప్రజాల గంధర్వ నగరువంటి మహాపట్టణాన్ని మనముక్కోటి తెలుగుదేవలంతా ఒకటి నిర్మించుకొని మన తెలుగుతల్లి నోములతోట పల్లవింపజేసి పుష్పఫలభరిత శోభాయమానంగా ప్రకాశింపజేయాలి.

తెలుగు తల్లులారా! లెండి! పార్టీవిభేధాలు విడవండి పనికిరానివి. పట్టుదలల్ని వదలండి నిజాం కోటమీద భుజాస్ఫాలనంచేసి అశోక ధర్మ చక్రపతాకం నిలబెట్టండి. తగుల

బడుతున్న గ్రామాల్ని చల్లార్చండి. దిక్కు మొక్కు లేని కాందిశీకులై, బక్క చిక్కిపోయి అడవుల పాలై నానా దురవస్థలు పడుతున్న సాటి తెలుఁగుతంత్రుల్ని సంరక్షించు కోండి. ఫార్వర్డు కాంగ్రెస్ సోదరులంతా, ఫార్వర్డు కమ్యూనిష్టుసోదరులంతా, ఫార్వర్డు రాయిష్టు సోదరులంతా, ఫార్వర్డు సోషలిష్టు సోదరులంతా ముక్కోటి తెలుఁగు దేవతా మహారాజశ్రీలై మహా తెలంగాన్ వజ్రాలకోటకట్టుకోవాలి.

సోదర సోదరీ మణులారా! నాది ఉన్మాద ధోరణి కావచ్చుగాని, మతోన్మాద ధోరణి మాత్రం కాదు. విశ్వ కర్నాటక సోదరులంతా, మహా రాష్ట్ర సహోదరు లంతా ముక్కోటి తెలుగు దేవతలతో కలసి, ఐక్య కంఠంతో "గ్రేట్ మహా తెలంగాన్" నినాదాన్ని మిన్నుముట్టించి నిజాం కోటను ముట్టడిస్తేగాని వీరభారత దేశం గుండెమీద ఉన్న హైద్రాబాద్ ఇత్తేహాదుల్ వ్రణపు పుండు మానిపోయి హాయిగా దేశం శాంతి సౌఖ్య మార్గంలో పడదు.

కాంగ్రెస్ - కమ్యూనిష్టు ఏక్ హో - హిందూ - ముస్లిం ఏక్ హో!

చలో హైద్రాబాద్ - బోలో మహా తెలంగాన్ జిందాబాద్!

మద్రాస్సముద్రం బీచీ
హైద్రాబాద్ నవాబ్ పేచీ
విడగొట్టాలోయ్
దండెత్తాలోయ్
కాంగ్రెస్ - సోషలిష్టు ఏక్ హో!
నెహ్రూ ప్రజాశాసనం
పటేల్ భుజాస్ఫాలనం

తెరచింది త్రిలోచనం
ఉరిమింది త్రిలింగభువనం
కాంగ్రెస్ రాడికల్ ఏక్ హో!

ఐకమత్యం ఆటంబాంబోయ్
ఏకమౌతూ ఎదిరించాలోయ్
తరగని సైన్యం ప్రజలేనోయ్
దొరలకు దైన్యం తోచాలోయ్
కాంగ్రెస్ కమ్యూనిస్ట్ ఏక్ హో!

తీవ్రధోరణి కవులంతానోయ్
దేశానికి దేవదత్తాలు కావాలోయ్
చదువు లుమాని సైనికులు కండోయ్
పదవులకోసం ప్రాకులాడకండోయ్
కాంగ్రెస్ సోషలిస్ట్ ఏక్ హో!

గుళ్ళు గోపురాలు యుద్ధశిబిరాలు కావాలోయ్
ఇళ్ళు కాపురాలు తుపాకిగుళ్ళుచేయాలోయ్
నెహ్రూ ప్రజాప్రభుత్వం నిలబెట్టాలోయ్
పటేల్ ప్రతిజ్ఞకి పట్టం కట్టాలోయ్
కాంగ్రెస్ రాడికల్ ఏక్ హో!

రామా— ఇదిగో! ఎవరండీ మీరు? ముందు మీరెవరో చెప్పి తరువాత మీ నినాదాలు చెప్పండి.

శివ— అంతా అరణ్యారోదనంగా వుంది. ఒకదానికొకదానికి సంబంధమే లేదు.

కేశ— ఏమిటో! చూస్తే పెద్ద గొడవగా వుంది.

రుద్రమ్మ— మీరు గిట్టనివల్లా గొడవై పోతాయి. నా జన్మలో ఇటువంటి మహా పవిత్రవాక్యాల్ని వినలేదు. కనలేదు.

ఇహ, మీరెవరూ మారు మాటాడకండి. ఈ మహా మహుడు కేవలం విప్లవయుగ పురుషుడు మాదిరి కని పిస్తున్నాడు.

మహా— (నవ్వుతూ) గొంగళి పురుగుల మధ్య విప్లవపురుషులు కని పిస్తారా? పనికొస్తారా? పప్పు ధప్పళాల వారు విప్లవ గేయాలు వింటారా!

రామా— రుద్రమ్మ గారూ! వింటున్నారా? మతిచెడి పిచ్చి బట్ట వెర్రివాడి మాదిరిగా కనిపిస్తున్నాడు. మాట్లాడే మాటకు తలాతోకా ఎక్కడా లేదు.

శివ— కేవలం ఇతడెవరో వెర్రివెంగళప్పగా వున్నాడు.

కేశ— నిస్పందేహంగా అంతే!

రుద్రమ్మ— సోదరులారా! మీ మాటలు వింటున్న కొద్దీ దేశానికి తీరని లోట్లుగా కనిపిస్తున్నై. ఇన్నాళ్టినుంచి మనమంతా కలసి చేస్తున్న ప్రజాసేవతో మహామహుల్ని తెలుసుకో లేని స్థితిలో వున్నామంటే దేశమాతకు తలవంపులుగా వుంటుంది. నలుగురిలో మనకు సిగ్గుచేటుగా వుంటుంది.

మేదిని చిక్కు చీకటికి
మిక్కిలి చిక్కెడి దేశభావి భా
గ్యోదయలక్ష్మి మేల్కొనుటకున్
తొలి కోడిగ కూయు యింత వ
స్తాదుల పస్తుబెట్టి ప్రజలందటి
కష్టము లేనిపోని పా
ట్టిదెస పోయు నాయక వరేణ్యులు
దేనికి పెద్ద గోలతో!

మహానాయకులారా! కొన్నాళ్ళపాటు మీరంతా విశ్రాంతి తీసుకోనియైనా దేశక్షేమంకోసం యేకమైతేగాని మీమాటలు నాకు బోధపడవు.

మహా— మహాతెలంగాన్ వీరనారీమతల్లీ! యీ దేశంలో కొత్త దారి తొక్కి, మహోన్నత భావాన్ని చెప్పిన వాణ్ణి యీనాటి నాయకులంతా పనికిరాని వాణ్ణిగా తేలిగ్గా తీసి పారేయటానికి మాత్రం అంతా యేకమౌతారు గాని దేశక్షేమం కోసం, భావి భాగ్యోదయం కోసం, నిరంకుశ నిజాం ఇత్తేహాదుణ్ని జయించటంకోసం, కొత్తగా తెచ్చుకున్న స్వతంత్ర భారత సింహాసనభాగ్యం కాపాడుకోనటం కోసమైనా యీ నాడు యీ నాయకులంతా యేకం కాలేక పోతున్నారు.

రుద్రమ్మ— సిగ్గు సిగ్గు! నాయకు లందరికీ సిగ్గు వచ్చే మహోపదేశం చేశాడు. మహాత్మా! నేనూ నా భర్తా కలసి మీ అడుగు జాడల్లో నడచి దేశమాత కష్టాలు తీర్చటానికి కొతూహాల పడుతున్నాము. నేడు మా జన్మ ధన్యత గాంచింది.

రామా— యీ రుద్రమ్మ తల్లి వొట్టి వెర్రిబాగోగులది. అభమూ శుభమూ తెలియనిది. ఏం చేద్దాం! ఈమెకు కూడా మతి చలించిందేమో!

శివ— కష్టాలెక్కువైన కొద్దీ కొంతమంది కిట్లా మతి చలిస్తూ వుంటుంది.

కేశ— కథంతా ఆదారికే వచ్చింది. ఏం చేద్దాం! వెడదాం పదండి.

రుద్రమ్మ— దేశనాయకులారా! కష్టాలవల్ల మాకు మతి చలిస్తే చలించిందిగాని మీరు మతి చలించనివారు కనుక కాస్త మతి చలించిన మమ్మల్ని ఉద్ధరించి పోవటానికి పుణ్యం కట్టుకోండి.

మీ బోధలతో నిరంకుశరాజయమబాధలతో కష్టకాలంలో పడి, స్థితిచెడి, మతిచెడి, అన్నపానాలకుచెడి, ఆదరాభిమానాలకు చెడి, ప్రాణాలు పోయి, ఎట్లా పడిపోయి వున్నామో చూడండి. అదుగో! యిల్లుతగులబడి,భర్తను వీడబడి, కిరాతకులచేత లాగబడి, ఎట్లా ప్రాణాలు పోయి, బక్కచిక్కిన నిరుపేదరాలు ఎట్లా పడివుందో చూడండి. మీ నిష్కల్మషమైన, మీ నిరుపమాన నిర్మల దేశసేవా పరాయణత్వంతో మీరు కొంచెం యీ పేదరాలికి ప్రాణం పోసి కూర్చోబెట్టి నట్లయితే నేనూ, మా బంధుబలగం మా వాడ వాడా, మీ అడుగు జాడల్లో నడచి మీ ఆజ్ఞ శిరసావహించి నడుస్తాం. పోకండి కాస్త.

మహా— అయ్యో పాపం! ఎవరమ్మా! నేనింకా చూడనే లేదు. ఈ రక్తమేమిటి? ఈ ఘోరమేమిటి? అయ్యయ్యో! కూడు లేక, గూడు లేక, హీనులై, దీనులై వున్న కష్ట జీవాళ్ని పొట్టబెట్టకొంటున్న యీ రాక్షసరాజ్యంలో బలియై (దగ్గర కొచ్చి) అమ్మా! నీ బిడ్డలకి కరవైతివా?

(తన పై పంచి చించి గుడ్డపేలికతో కారుతున్న నెత్తురు అద్ది, చేతికి మెడకు కట్లు కట్టును)

రుద్రమ్మ— ప్రాణం వుందా మహాత్మా!

మహా— ఉన్నది తల్లీ! దయారససముద్రుడైన భగవంతుని ప్రేమ సుధారసతరంగాలు కాస్త వీస్తున్నందు వల్లనే ప్రాణం కడగట్టి మావంటి పనికిమాలిన మానవ జీవితాలకి సేవ చేయటాని కున్నది కాబోలు!

రుద్రమ్మ— ప్రాణం వుందా మహాత్మా! ప్రాణం వుందా! రామీ! రామీ! మన మొఱ విను దేవుడు మాదిటిగా యీ మహాత్ముడొక్కడు వచ్చాడు. కనవిచ్చి చూడగలవా రామీ!

మహా— (లేవదీసి కూర్చోబెట్టి రుద్రమ్మగారూ! కాస్త మీరొరెక్క పట్టుకోండి. నేనీ రెక్క పట్టుకొంటాను. మంచంమీద పడుకో బెడదాం.

రామా— అంతా అయోమయప్పు గోలగా వుంది.

శివ— ఇటువంటి అమాయకత్వం వల్లనే దేశం ఈ స్థితికి వచ్చింది.

కేశ— ఏం చేద్దాం. చెప్పినా వినిపించుకోని మేళ్ళంగా. యేంప్రయోజనం లేదు. ప్రాణంలేని పీనుగుకు పెట్టుకొని యేడిస్తే యేం ప్రయోజనం. పీనుగుల్లోంచి పౌరుషం పరాక్రమం ఎట్లా వస్తుంది.

( మహారాజశ్రీ రామిచెయ్యి తన భుజంమీద వేసుకొంటాడు. రుద్రమ్మ రామిరెండవచెయ్యి భుజం మీద వేసికొని, నిల్చిని గేయం పాడతారు )

చల్లారని శౌర్యం మాదీ
ముల్లోకం వుడికించేదీ
ఇంటికి పట్టిన దయ్యాన్నింకా
గెంటేటందుకు పుట్టామోయ్                    చల్లా

మీ మాదిరి నరులం కామూ
మీ హాయికి మరలం మేమూ
మహా ప్రళయాలు పగిలిందాకా
సహాయ పడటం కల్లో మాటా                    చల్లా॥

(తెరపడును)

## రెండోరంగం — అనుముకొండవీధి

(కోటారెడ్డి మహా తెలంగాన్ హోం గార్డ్సును వెంట పెట్టుకొని, ఫాజును పైలులో నిలబెట్టి గేయం చెబుతుంటాడు. అందరూ అంటారు.)

కోటారెడ్డి— జై హింద్ మహా తెలంగాన్! కీర్తి మహా తెలంగాన్ చలో హైదాబాద్! బోలో మహా తెలంగాణ్ జిందాబాద్!

మహా తెలంగాన్ మహారాజశ్రీ
నిజాంకోటపై ధ్వజం కట్టాలోయ్ ॥మహా॥

రాయల రాజసం
ఊయల లూగుతూ
తుంగభద్రలో
తొణుకుతున్నదోయ్ ॥మహా॥
ఇంద్రధనస్సుగ
కృష్ణా ప్రవాహం
ఫల్గుని పౌరుషం
ప్రవహించెనోయ్ ॥మహా॥

వీరభారతం
మేరుపర్వతం
గోదావరియై
ఘోషించినదోయ్ ॥మహా॥

యశో విశేష
విశాఖసముద్రం
బొబ్బిలి బెబ్బులి
బొబ్బరిల్లెనోయ్ ॥మహా॥

పలనాటిపౌలం
తులతూగుబలం
తొలకరి మెఱుపులై
పులకరించెనోయ్ ॥మహా॥

కోడెలు లేచిన
గుంటూరు మండలం
ప్రిభలు కట్టుకొని
పరిఢవిల్లెనోయ్ ॥మహా॥

జై హింద్ మహాతెలంగాణ ! క్విట్ మహాతెలంగాన్ !
చలో హైద్రాబాద్ ! బోలో మహాతెలంగాణ జిందాబాద్

(స్టేట్ కాంగ్రెస్ రామారావు ప్రవేశం)

రామా— ఏం కోటారెడ్డిగారూ ! ఫౌజును కూడా తయారుచేసి వట్టున్నారే ?

కోటా— తయారు చేసుకోవలసిన అవసరం చాలా వచ్చింది కనుక తల్లులూ, తండ్రులూ, పిన్నలూ, పెద్దలూఅంతా మహా తెలంగాన్‌ను సంరక్షించు కోటానికీ, నిజాంకోట పట్టుకో టానికీ మహాతెలంగాన్ హోం గార్డ్సులో చేరాలి. దానికి మీ స్టేట్ కాంగ్రెస్ వారి అభిమానం కూడా వుంటే ద్విగుణీకృతంగా మహాతెలంగాన్ హోం గార్డ్సును తయారు చేసి, అనతికాలంలో నిజాంకోట మీద జెండా కట్టి రావ టానికి బలం బాగా పడుతుంది.

రామా— మీరు చెప్పేదంతా బాగానే వుంది. కాని, ఎవరో మహా రాజశ్రీ గారంటారు- ఆయన వేసిన అడుగులో అడుగు వేసి నడవమంటారు. అదిగో అక్కడే వచ్చింది మీకూ నాకూ అభిప్రాయభేదం. పైగా ఆ మహారాజశ్రీ గారంటే కార్యశూరుడేమో అనుకొంటే వేఃమాత్రం కాదు. వెర్రి

కేకలు, వెర్రివాగుడు, వెర్రిపరుగులూ వేస్తుంటాడు. ఇంకోటి. వీరి స్వభావం అంతమంచిది కాదని వింటున్నాం.

కోటా — అయ్యా! రామారావుగారూ! నిష్కల్మష దేశసేవా పరాయణుడూ, ప్రతిఫల వాంఛారహిత మైన మహాప్రతిభా వంతుడూ, పరోపకార పారీణుడూ అయిన మహారాజశ్రీ గారినే మీవంటివారు నిజం తెలుసుకోకుండా నమ్మకపోతే యెట్లా చెప్పండి. వారి మహాజ్ఞానాన్ని చూచి, గిట్టని పాపిష్టి సంఘం వార్ని యేకాకినిచేసి వారికొంప నిలువునా గుండం వేసి, నోరులేని రోగిష్టిమారి పిల్లల్ని ముందుపడేసి, ఎక్కడా అన్నిపచ్చి మంచినీళ్ళుకూడా పుట్టకుండా చేస్తున్న రోజుల్లో యేమాత్రం చలించక నిజసాహస జ్ఞాన వీర బల పరాక్రమంతో దేశదుస్థితిని తొలగించటానికి అహర్నిశం పాటు బడుతున్న సంగతి మీకు తెలియదు కాబోలు! తెలిస్తే మీరిట్లా నిరసించటానికి సాహసించలేరు. ఇట్లా దేశానికి పనికొచ్చే మహామహుల్ని మహాజనం కంటపడ నీకుండా తీరని దరిద్రాల్ని, ఉపద్రవాల్ని దేశానికి తెచ్చి పెడుతున్నారు.

రామా — ఐతే, కోటారెడ్డిగారూ! మీ మాత్రం అనుభవం మాకు లేకపోయినప్పటికీ చూచాయగా తెలుసుకొంటున్న విష యాల్ని బట్టి యేవో కొన్ని నిదర్శనాల్ని ప్రత్యక్షంగా చూస్తున్నాం. మొన్నొకమాటు మీరున్నారేమోనని మీయింటికి మేము వస్తే, మీరు మహా గురుపుంగవులుగా పూజించుకొంటున్న మహారాజశ్రీ గారు మీ భార్యా గారితో యేమేమో సరసాలాడుతున్నారు, "ఇదేమిటా?" అని మాకు చాలా ఆశ్చర్యం వేసింది. కామ్రేడ్ శివరావు గారు కూడా ఆసమయంలోనే అక్కడికొచ్చారు. నామాట అబద్ధమైతే అతణ్ణి కూడా అడగండి. కామ్రేడ్ శివరావు గారి పార్టీ కమ్యూనిస్టుపార్టీ. నాపార్టీ స్టేట్ కాంగ్రెస్ పార్టీ.

మాయిద్దరికీ ప్రతివిషయంలోనూ పోటీలూ భేదాభిప్రాయా
లూ వచ్చి పడకుండా కొట్టుకుంటున్నాం గదా! నా
మాటకు తగినట్లుగా తాళంవేసి ఎందుకు మాట్లాడుతాడు?
అరుగో వస్తున్నారు — అడగండి.

(కామ్రేడ్ శివరావు ప్రవేశం)

శివ— హల్లో! కోటారెడ్డిగారూ! మీకోసమే వస్తున్నాం.

కోటా— ఇప్పుడే మిమ్మల్ని అనుకొంటున్నాం కూడా!

రామా— అయితే, కామ్రేడ్ శివరావుగారూ! మొన్న కోటారెడ్డి గారింటికొచ్చినప్పుడు మీరు కూడా వున్నారు కదూ?

శివ— ఆ ... వున్నాను. అయితే?

రామా— మరి ...... రుద్రమ్మగారూ మహారాజశ్రీ గారూ కలసి మాట్లాడుకొంటున్న మాట నిజమేగా!

శివ— కలసి మాట్లాడుకోవటమేమిటి? ఇద్దరూ కలసి మహోప న్యాసాలిస్తేను.

కోటా— ఐతే, ఉపన్యాసాలివ్వకుండా వుంటారా? ఇస్తే దేశం పాడై పోతుందంటారా? ఏమిటో మీరు చెబుతున్నది నాకర్థం కావటం లేదు.

రామా— అది కాదండీ కోటారెడ్డిగారూ! మహారాజశ్రీగారు మతి లేకుండా వెర్రివాడిమాదిరి తిరుగుతున్నారు. సంసారమూ లేదు. సంపాదనా లేదు. అతడి వెర్రి వాగుడూ, వెర్రిధోరణీ నచ్చి మీ యిల్లాలైన రుద్రమ్మగారు వారు చెబుతున్న వాటికెల్లా ముచ్చటపడి యిల్లంతా దోచిపెడుతున్నారు. వెంటపడి తిరుగుతున్నారు. ఇది మీకు తెలుసునో తెలియదో అని చెబుతున్నాం. మాకేం?

[illegible]

[illegible]

[illegible]

[illegible]

[illegible] మంటగొట్టి [illegible]

[illegible] కోటగట్టుకుంటున్నారా ॥ [illegible] ॥

[illegible]

[illegible]

[illegible]

[illegible] ॥ [illegible] ॥

జై హింద్ మహా తెలంగాన్ ! క్విట్ మహా తెలంగాన్ !
చలో హైద్రాబాద్ ! బోలో మహా తెలంగాణ జిందాబాద్ !

మహా తెలంగాన్ ప్రపంచ మహాజనులారా ! ఇహ కుల, మత, జాతి, వర్గ, పార్టీ, పక్షకక్ష భేదాలతో, ద్వేష రోషాలతో దేశాన్ని తగులబెట్టకండి ! నిజాం నిరంకుశ ప్రభుత్వంలో మత్తేభాలు మాదిరి పెరిగి మదించిపోతున్న ఇత్తేహాదుల్ ముస్లిమీన్ దండులు వూహూరా మొగబడి తల్లుల్ని, పిల్లల్ని, తండ్రుల్ని, తమ్ముల్ని చిత్రవధలు చేసి, గ్రామాల్ని తగులబెట్టి, పశువుల్ని కోసుకొని తిని, తెలంగాణా 8 జిల్లాల్ని, మహారాష్ట్ర 3 జిల్లాల్ని, విశ్వ కర్నాటకజిల్లాల్ని రెండింటిని, హైద్రాబాద్ సికింద్రాబాదుల్ని పొట్టను పెట్టుకొంటున్నై. రాత్రింబవళ్ళు కన్ను మూయక, ఆలుబిడ్డలతో సహా చెమటోడ్చి, పశువులతో సహా మొముకల్ని రాలగొట్టుకొని, వానలకి తడిసి, చలి

గాలులకు వాళ్ళు చిల్లులుపడి, వడగాడ్పులువీస్తున్న మండు టెండలకిమలమలమాడి, భూమినిపండిస్తున్న సంవత్సరప్రసాదీ నానూపంటల్ని కుప్పలువేసి, దేశమాత వరాల నోముల్ని పండించి జగత్కల్యాణతోరణం కట్టించి, విశ్వజనప్రేమ సంపాదించటానికి ప్రయత్నిస్తున్న వైతంత్రుల్ని, సాంకేతికజ్ఞుల్ని, వర్తకతంత్రుల్ని, వివిధవృత్తివిద్యా కళాకోవిదుల్ని ప్రోత్సహించి, బయటకీయిప్పించి సంవత్సరం పొడుగూతా పండించి కుప్పలు వేసిన బంగారు పంటకుప్పల్ని తగులబెట్టి, దేశాన్ని నట్టనడిసముద్రంలో కలిపివేస్తున్న విలయవిషమపరిస్థితుల్ని కనులారా చూస్తున్నప్పటికీగూడా మీలో మీరు పరస్పర కలహాకారణాల్ని, అసహన మానవ మారణ దానవ దౌర్జన్యాల్ని నానాటికీ హెచ్చుచేసుకొని దేశమాతకడుపు పగలగొడతారా ?

ఈ దేశం పరస్పర కలహాకారణ మారణాల కోసం పెరుగుతున్నదా లేక విశ్వభారతియై భగవన్మతరాజ్య సంస్థాపనార్థం జగత్కల్యాణ నవరత్న సుందరరమ్యహర్మ్యం కోసం పాటుపడుతున్నదా ?

మన పూర్వ పురుషసింహులు, మహాతపోనిష్ఠాగరిష్ఠులు వీరనారీమతల్లులు బాలగోపాలకచక్రవర్తులు, అఖండదాన వీరశూర కర్ణాదులు, ప్రచండప్రతిజ్ఞా పరిపాలనాదక్షులైన భీష్ములు, అద్వితీయ ధనుర్విద్యాసముద్రులైన ద్రోణులు, మృదు మధుర మంజుల వాగ్విలాస విశాలవిశ్వ కవితాగాన సుధారసప్రవాహాల్ని దిక్కులకెగదన్నించిన తిక్కన్నలు బమ్మెర పోతన్నలు, శ్రీనాథకవిరాజులు, వ్యాస వాల్మీకి కాళిదాస మహాకవిపరమేశ్వరులు అవతరించి మన గొప్ప చెప్పిపోయినవి కలహాకారణాలా ?

మన గొప్పలు చెప్పుకోవలసి వచ్చినప్పుడు జంకుగొంకు లేకుండా, సిగ్గు బిడియం లేకుండా, మన పూర్వ [illegible]

సంప్రాప్తిస్తుందా? ఇది కేవలం తన ప్రాణప్రమాదానికి తెచ్చిపెట్టుకొన్నట్లౌతుందేమోగాని యేనాటికీ ముడిపడ కుండావున్న హిందూ-ముస్లిం ఐక్యతకి మాత్రం వుపకరించే దిగా కనిపించదు-కనిపించటంలేదు.

మతాన్ని, సంగీతాన్ని మానవమాత్రులికి మత్తుమందుగా పట్టించి, నిషాయెక్కించి ప్రధాన మానవ ధర్మరాజ్య సింహా సనమైన జ్ఞానానికి దూరంచేసి తీసుకొనిపోతున్న మూఢ విశ్వాసాల్ని, పనికిమాలిన పూర్వాచారాల్ని, సంఘం లోంచి మనం పారద్రోలి పటాపంచలు చేసినప్పుడు మానవు లంతా యేకం కావటానికీ దేశానికి వచ్చిపడ్డ దరిద్రాల్ని వుపద్రవాల్ని చీల్చి చెండాడటానికి వీలుంటుంది,

మహాజనులారా! ప్రస్తుతం దీర్ఘోపన్యాసాలకి, విందులూ వినోదాలకి, కథాకాలక్షేపాలకి సమయంకాదు. దేశం తగులబడుతోంది. రాక్షసులు మితిమీరిపోతున్నారు. జగజ్జనని దుఃఖం చతుస్సముద్రాల్ని పొంగించి మిన్నుముట్టి స్తున్నది. కనుక మీరంతా నడుంకట్టి దేశానికొచ్చిపడ్డ ప్రజాకష్టానికి నాయకత్వం యిచ్చి పరస్పరం అసహన కలహాకారణాల్ని మరచిపోయి, యేకమై, మనముందు మతం నిషాతో మత్తెక్కి కన్నుమిన్ను కానకుండా వూళ్లు తగులబెడుతూ, నిజాం నవాబ్ సింహాసనాన్ని కూడా తామే దురాక్రమణజేసి యేకచ్ఛత్రాధిపత్యంగా యీ అఖండ భరతవర్షాన్ని పరిపాలించుదామని ముకిసిపడుతున్న ఇత్తేహాదుల్ ముస్లిమీన్ దండుల్ని ముందు యీ దేశంనుంచి అరబ్బీదేశాలకి తరిమివెయ్యాలి. మన ప్రజలమీదా, మన సాంప్రదాయాలమీదా ఎక్కువ మక్కువతో వున్న మన నిజాం నవాబుని మన మహాతెలంగాన్ రాజ్య ప్రజా నీకంలో కలుపుకోవాలి, దేశదారిద్ర్యం తీర్చుకోవాలి.

రామా—ఇవాళ తెమిలేట్లు లేదుగాని యీ ధోరణి...కోటారెడ్డి గారూ! ఎప్పుడూ వింటున్న ధోరణే ఇహా మేం వెడతాం.

కోటా—వెడుదురుగాని బాబు! విన్నారా? మహారాజశ్రీగారిమీద యేమేమో నీలాపనిందలు యెక్కిస్తూంచో విరచుకొని పడు తున్నై. అటువంటి నీలాపనిందల్ని పాలించుకొందామా? ఇంతవరకు నిన్న మహారాజశ్రీగారి మార్గంపట్టి నడుద్దామా? యేదో నిర్ధారణజేసి వెళ్ళండి.

రామా—మేమంత నిర్ధారణచేసి చెప్పగల సమర్థులంగాం. అదిగో! పోలీసుమూకాకూడా వస్తున్నది. మాదారి మేం వెడతాం. అదిగో తుపాకులుకూడా కాలుస్తున్నారు.

(తెరలోపల తుపాకులు కాల్చిన చప్పుడు వినబడుతోంది)

శివ—అదుగో! కాల్పులు దగ్గఱకూడా వస్తున్నై. ముందీ దండు లోంచి తప్పించుకొనిపోతే మంచిది. తరువాత నిజాంకోటా పట్టుకోవచ్చు. నిజాంనవాబుని మనలో కల్పుకోవచ్చు. అదిగో! రిజర్వుపోలీసు వస్తున్నా, పరారుకావాలి?

(ఎక్కడివాళ్ళక్కడ నిష్క్రమిస్తారు. మిలిటరీ దుస్తులతోవున్న ఫౌజుకూడా తరాలున నిష్క్రమిస్తుంది. మహా రాజశ్రీ, కోటారెడ్డి, రుద్రమ్మ, గొల్లసుబ్బడు, రామి పుల్లా కులూ, చింపిరిగుడ్డలూ యేరియేరి మూటలుకట్టుకొంటూ వుంటారు. ఉన్న యాక్టర్సును సంపుచ్చుకొనటానిగ్గాను మహాతెలంగాస్ ఫౌజువాళ్ళే నిజాం మిలిటరీటోపీలు పెట్టు కొని దుస్తులుధరించి వస్తారు. వీళ్ళని పిచ్చివాళ్లుగా భావించి మిలిటరీవాళ్లు లెఫ్ట్‌రైట్లు (తొక్కుకొంటూ వెళ్ళిపోతారు)

మహా—గుడ్డెద్దు చేలోపడ్డట్టు శత్రుసైన్యాధిపతిసైన్యం నడచిపోయే టట్లు మన యుగంధర రాజకీయచాతుర్యం చూపించాం. ఇట్లా సమయానికి తగ్గట్టు వేషభాషల్ని మార్చుకొని, మనం

నడుచుకొని పోవలసినరోజులు. పిచ్చివేషంకూడా దేనికి పని కొస్తున్నదో గ్రహిస్తున్నారా లేదా? మనమంతా యీ నిజాం ఇత్తైహాదుల నిరంకుశ రాజరాక్షసుల్ని చీల్చి చెండా డటానికి యింకా యెన్నెన్నో వేషాలుదాల్చాలి. విప్లవాలు లేపాలి.

కోటా—గురుపుంగవా! మేమంతా మూఢవిశ్వాసాల్ని దట్టంగా పట్టి స్తున్న దిక్కుమాలిన సంఘంలో పుట్టిపెరుగుతున్న అమా యకులం అవివేకులం గనుక మీసమయస్ఫూర్తికి, సంద ర్భానికి తగ్గ కార్యశూరత్వం తెలుసుకోలేకపోయాం. ఇంకా కొంతమంది మాలోవున్న మహామహులుకూడ తెలుసుకో లేక పోతున్నారు.

మహా—సరేగాని, గొల్లసుబ్బడు అకస్మాత్తుగా మనతో వచ్చికలిశాడు. మొన్నమళ్లీయితణ్ణి పట్టుకుపోయారన్నారుగదా, ఇంతలో ఎట్లా వచ్చాడబ్బా!

సుబ్బడు—గురువుగోరూ! సత్తేప్రమాణంగా సెప్తంటా. అన్నాయంగా రుద్రమ్మగోరింటో జొరబడి నానాయిదాలుగా హింసించి నన్నట్టుకుపోయిం తర్వాత ఆదేశముఖ్ గోడి పెళ్ళాంకి నల్ల తాచు కరిసింది. యే మంత్రగోడొచ్చినా, యే వైద్దుగు డొచ్చినా లేవనేలేవలేదు. అప్పుడందరూ గొల్లుమని గోలెడుతుండగా, నన్ను కిట్టేసిన సాయబ్బుగోడికి నాను యేరుతెచ్చి లేవలీత్తానని సెప్పంగానే, యీమాట దేశ ముఖ్ గోడికి సాయబయ్య సెప్పి, నన్నిడిపించి, సాయ బయ్యని, నన్ను యేరుకోసం అడివికి తోలిండ్రు. ఆపాల, ఒకియేరు తీసుకొని, యెంటనే సాయబయ్య కిచ్చి, అరగదీసి కళ్ళల్లో యేత్తుండండి—నేనింకో యేరు తీసుకొత్తుంటానని పంపించినాను. గుభాల్న యేరు తీసుకుపోయి, నేను సెప్పి నట్టు సేయంగానే దేశముఖ్ గోడి భార్యా పానం వచ్చి

కూకుండడి. ఆచంబరంమీాద దేశముఖ్‌గోడు నాసిచ్చ తప్పించి, యిడిసించమని పురమాయించిండు. నానడివిలోంచి తప్పించుకొందామనిఅడవిదాటి వూరుమీాదుగా పోతుండా. సాయంఠయ్య గుర్రంబూ ద లగెత్తుకొచ్చి, నాసిచ్చ దొరగోరు తప్పించిండ్రని సెప్పిండు. అదిగద్దో దాంతో మీాదర్శనం మల్లీ సేసుకొండా సామీా!

మహా—అదాకిథ! విషప్పురుగులకి తగినమందు నీదగ్గఱకూడా వుందన్న మాట! భేష్! గొల్లసుబ్బడు మనకి తగ్గవాడు దొరికాడు. అయితే, యీా పల్లెపట్టణాల్లో జొరబడి దోచుకుపోతున్న నిరంకుశపిశాచాల్ని మనం ఎదుర్కొనబోతున్నాం గనక వెర్రివెర్రిపాటలతో, వెర్రివెర్రివికారాలతో తిరిగి యీత నిరంకుశ ధనికరాజ సంస్థానాల మోచేతిగంజిత్రాగి, బలిసి బకాసురులైన ఱ ఠకారిదార్లని, పంచమాంగదళాల్ని మనం చాకచక్యంతో కనిపెట్టి ముట్టడించి బంధించివేయాలి. సాధ్యమయినంతవరకు కాంగ్రెస్ సోదర్లని, కమ్యూనిష్టు సోదర్లని, రాడికల్ సోదర్లని, స్వదేశముస్లిం సోదర్లని, హిందూమహాసభా సోదర్లని, మనం కల్పుకొంటానికి ప్రయత్నించాలి. పాటుపడాలి. కల్పుకోవాలి. వారితో వాదభేదాలు మనం పెట్టుకోరాదు. వారి శక్తిసామర్థ్యాలూ, ప్రజాసేవ ప్రభావాలూ, సామాన్యమైనవికావు. మనం యేపార్టీవారిని తృణీకరించరాదు. నాలుగు నారతడపలు కలిస్తేగాని ఆడు తయారై మదించిన మత్తేభాల్ని బంధించలేవు.

ప్రస్తుతం యింకోమార్గం వేస్తున్నా. దానికి తలోపాత్ర ధరించి నిర్వహించాల్సినపని చాలావుంది. రేపు దేశముఖ్ మీారాసాహెబ్ హైద్రాబాద్ వెళ్తారనీ, రజ్వీని కలుస్తారని తెలిసింది. ఇత్తేహామల్ అధ్యక్షుడైన రజ్వీదగ్గఱనుంచి

ప్రత్యేకంగా ప్రజానాశనానికి యే యే యధికారాలూ, మాయోపాయాలు తెచ్చుకోబోతున్నారో మనం కని పెట్టాలి. దానికి నేను జ్యోతిష్యశాస్త్రజ్ఞుణ్ణిగా తయారై ముందు రజ్వీదగ్గఱ హాజరై వుంటాను. రుద్రమ్మగారు గాయకురాలి వేషంధరించి నాతోబాటురావాలి. ఈ మెగారి సహజసౌందర్య గానకళా సౌఖ్యంలోను, నా అప్రతిహతమైన జ్యోతిర్విద్యా సామర్థ్యంలోను రజ్వీనిముంచి, బంధించి, రజ్వీదగ్గఱ సాధించుకురావలసిన రాజకీయ రహస్యాల్ని సంపాదించుకురావాలి. మీరు యీలోగా దేశముఖ్ రాణీగార్ని ప్రజాసేవలో కలుపుకొనటానికి సోది వేషం ఒకరూ, నూనెగుడ్డలవాని వేషం ఒకరూ, బుడబుక్కలవాని వేషం ఒకరూ వేసుకొని రేపు తయారుకావాలి. తరువాత కథ చెబుతా. ఏంకోటారెడ్డిగారూ! నేను చెబుతున్నవి నచ్చుతున్నవా?

కోటా——బాబు! అణుమాత్రంకూడా మీమాటలు తీసిపారేయలేం. మీఅడుగుదాటలేం. మీరు చెప్పినట్లు అన్నింటికీ సిద్ధమై నడుస్తాం.

మహా——రేపు మీరు నిర్వహిస్తున్న పాత్రలతో మీరాకీ, దేశముఖ్ కి విరోధాలు, విద్వేషాలు పుట్టించాలి.

కోటా——చిత్తం. ఎట్లాగో శలవివ్వండి!

మహా——మీరాసాహేబ్ తన కొచ్చిపడబోతున్న ఉన్నతాధికారంతో దేశముఖ్ ని పదభ్రష్టుణ్ణిచేసి, చివరకి రాణీగార్ని కూడా అపహరించాలని, చెఱపట్టాలని దురుద్దేశంతో వున్నట్లు రాణీగారికి సోదిలోచెప్పి నమ్మకం పుట్టించాలి. ఆమాదిరిగానే నూనె గుడ్డలవాని వేషంతో, బుడబుక్కలవాని వేషంతో శకునాలుచెప్పి నమ్మకం పుట్టించాలి. తెలిసిందా? మిగతా కథంతా చేరువలోకి త్వరలో తీసుకురాగలను.

రుద్రమ్మ—మనమింకా ఆలస్యం చేయకూడదు. రాజకీయ శహాస్యాల్ని బహుభద్రంగా సమాలోచించుకొని కార్యరంగం లోకి దిగాలి. శత్రువుల్ని తెగటార్చాలి.

సుబ్బడు—గురువుగోరు సెప్పిందంతా సేసితీరాలి. మశ వోళ్ళం రెండోళ్ళ సెవికి పడకుండా రాచ్చాలు సెప్పుకోవాలి. తస్సాదియ్యా! యీ దెబ్బతోగాని యీ దేవిడీలన్నీ దిక్కు మొక్కు లేకుండాపోవు. గురువుగోరూ! నాభార్య రామి సోదమ్మ యేసం యేత్తుంది. నేను నూని గుడ్డలో డేశం యేసుకొంటా. మా కోటా రెడ్డిగోరు బుడబుక్కలోడేశం యేసుకొంతారు. తొలికోడి కుయ్యకమునుపే బుడబుక్కలోడి యేసంతో కోటారెడ్డిగోరు దివాణంముంగల సెకునాలు శెప్తరారు. అల్లయ్యినాక, నూనిగుడ్డలోడి యేసం యేసుకొని నాను సెకునాలు సెప్పుకొంటా దేశముఖ్ దివాణంముంగల సిద్ధమౌతా.

అదయ్యాం తర్వాత మా ఆడది రామి సోదమ్మయేసం యేసుకొని, దేశముఖ్ దివాణంలోకిపోయి సోదిసెప్పొస్తది. దాంతో మీరిందాక సెలవిచ్చిండట్టు పొగలూ శెగలూ లేసి, దేశముఖ్ గోడికీ, మీరాగోడికీ, లడాయిపడి చర్వ నాచనమౌతారు. (మీసంమీద చెయ్యివేసుకొని)నూడండి నా దెబ్బ! తంబానికేసి కట్టేసి కొట్టింద్రుకదూ! అదింకా మర్చిపోలా నేను. గాపకంవుండాది. ఈపాలె దేశముఖ్ గోడ్కి, ఆడి నిగామాన్ గోడ్కి తలాతలావగిలి కొబ్బరి ముక్కలుకావాలా. వూరి పొలిమేర మొమ్మాకి యీల్లిద్దర్ని జాతర సెయ్యాల! నాన్నిద్దరోవాల!

రామి—యింకా ఆపవేంది? సెయ్యాల్సినపని శానావుంటే ఒకటే సోదాయెయ్యాల్నే! ఇహాసాలించు, గురువుగోరేదన్నా సెప్తతారు.

సుబ్బడు—ఆసి అదికాదశే! సెయ్యాల్సిన ప్రోగ్గాం అంతా సెప్పుకొ త్తుండా. మల్లీ మర్సిపోతే అప్పటికప్పుడు సెప్పేవారెవరుం డారు? అల్లందుకనేయింత సెప్పుకొంటుండాం.

మహా—గొల్లసుబ్బడు చదువురానివాడైనప్పటికీ చాలా జాగ్రత్తగా ఆలోచించి, కార్యరంగానికి తగ్గట్టుగా చెయ్యాల్సినవి చెప్పాడు. ఇందులో యేవీ మరచిపోకూడదు. ఇంకెవ్వరి కెవరికీ మనం, మనమాటలూ పట్టుపడగూడదు. ఇది మాత్రం బహుజాగ్రతగా జ్ఞాపకం వుంచుకోవాలి. పోదాం పదండి కోటారెడ్డిగారు!

కోటా—చలో హైద్రాబాద్! బోలో మహా తెలంగాన్ జిందాబాద్!
మహా తెలంగాన్ మహారాజ్ కీ
నిజాం కోటపై ధ్వజం కట్టాలోయ్

(అని పాడుకొంటూ అంతా నిష్క్రమిస్తారు. తెరపడుతుంది.)



# చలో హైద్రాబాద్

## తృతీయాంకం

### ఒకటోరంగం—హైద్రాబాద్—రజ్వీ ప్రైవేట్ హౌస్

(రజ్వీ హుక్కా తాగుతుంటాడు. ప్రక్క ఒకడు వింజామరం వీస్తుంటాడు. ఫ్యాన్ వచ్చి ఒక విజిటింగ్ కార్డు రజ్వీ టేబుల్ మీద పెడతాడు. రజ్వీ విజిటింగ్ కార్డు చూచుకొని జ్యోతిష్య పండిట్‌ని, భువనసుందరిని లోపలకు తీసుకురమ్మని చెప్పి పంపిస్తాడు. జ్యోతిష్య పండిట్ వేషం వేసుకొచ్చిన మహారాజశ్రీ, భువనసుందరి వేషం వేసుకొచ్చిన రుద్రమ్మ సలాములు చేసుకొంటూ ప్రవేశిస్తారు)

రజ్వీ—మీకీ దేశం హేమ్టి హైవుందండీ?

పండిట్—మాది తెలుగు దేశం హాజరత్ జీ. మాది నెల్లూరు జిల్లా అండి.

రజ్వీ—మీది నెల్లూరా హండీ! నెల్లూర్ మే బల్ జానల్ హుండారని పుకార్ హుందీగదయ్యా?

పండిట్—చాలాకాలంనుంచి పుకారువుంది హాజరత్ జీ.

రజ్వీ—హైతే...మీకీ హొచ్చినా పని హేమ్టి హుందీ?

పండిట్—నేను జ్యోతిష్యశాస్త్రజ్ఞుణ్ణి. జాతకాలు చూచి చెప్పగలవాణ్ణి. భూతవర్తమాన భవిష్యత్ కాల పరిస్థితులన్నీ అవలీలగా చెప్పగలవాణ్ణి. తమవంటి ప్రభు సంస్థానాలకొచ్చి తమజాతక ప్రభావాల్ని చెప్పి శెలవు తీసుకొందామని వచ్చాం.

రజ్వీ—అచ్ఛాహై! బైఠో బైఠో!

(పండిట్ రావు, భువనసుందరి కూర్చుంటారు.)

పండిట్—ఆప్‌కా నాం కాశీంరజ్వీ కహూహాండి!

రజ్వీ—అచ్ఛా అచ్ఛా! హైబోలో బోలో.

పండిట్—(జాతక గ్రంథంతీసి, లెక్కలువేసి) మీకు పెద్దయోగం పట్టనున్నది. కాస్తజాగ్రత్తగా వినండి.

రజ్వీ—బోలో పండిట్ మహారాజ్.

పండిట్—మీరు యీనైజాం రాజ్యానికి రెండునెలల్లో నైజాంనవాబ్ సింహాసనం అధిష్టించబోతున్నారు. అంటే, నైజాం రాజ్యానికి మీరే నవాబుగా వుండబోతున్నారన్నమాట.

రజ్వీ—యేబాత్ సచ్‌హై పండిట్ మహారాజ్. బోలోబోలో!

పండిట్—కాని, మిమ్మల్ని యీలోగా నైజాంనవాబుగారే తమ అనాచకప్రజల మాటలునమ్మి మిమ్మల్ని హత్యచేయటానికి ప్రయత్నిస్తాడు. ఇదిముమ్మాటికీ సత్యం. జాగ్రత్తగా వుండాలి. ఈరాశిలో శనికి ప్రధాన అధికారం బాగావుంది.

రజ్వీ—నవాబ్కీ బల్ పద్మాష్ హైనాహూహాండీ! హాయ్! నమ్మక్ హరాం! నమ్మక్‌హరాం! ఈనవాబ్కీ యెంత హుప్కారం నేసినా ప్రయోజనం లేద్. హీండ్కీ సుల్తాన్‌కాడ్. హీండ్కీ ముసల్మాన్ దిల్‌కి సైతాన్‌హల్లే బట్టాడ్. హీండ్కీ ఖోందర్లో పాయిశ్చిత్తంచేసి తీరవలా.

పండిట్—మీరు జాగ్రత్తగా వుంటేమట్టుకు మీకేం ఫర్వాలేదు. మీరే జయిస్తారు. మీరే నవాబుని తొందరలో రాజ్య భ్రష్టుణ్ణి చేయగలుగుతారు. ఇందులో సందేహంలేదు.

రజ్వీ—మీకీ బహుమానం బడాజాగీర్కీ ఉత్తర్వు సేస్తాం. హైతే హీమే హెవరూహాండీ!

పండిట్—నాకుమార్తె. సంగీతసాహిత్య కవిత్వాలలో పాండిత్యం సంపాదించుకొన్నది. తమ దర్శనం చేయించి, తమ అనుగ్రహం సంపాదించుకొని పోవటానికి వెంటపెట్టుకొని తీసుకు వచ్చాం.

రజ్వీ—హాదీహాండీ! హొక్క పాటా గావో.

పండిట్—వీణకు శృతిజేసుకొని ఒక్కపాట మృదుమధురంగా పాడి విఃపించమ్మా!

(భువనసుందరి వీణకు శృతిపెడుతూవుంటుంది.)

రజ్వీ—హీమె పేరు హేట్టిహాండీ?

పండిట్—మాఅమ్మాయి పేరు భువనసుందరండి.

రజ్వీ— అచ్ఛా! అచ్ఛా! బహుత్ అచ్ఛానాంహై!

పండిట్— ఈనవాబుగారిమీద ఒక్కగేయం కట్టి పాడుతల్లీ!

భువన—(గేయం, హిందూస్తానీ రాగంలో ఆలాపన చేస్తుంది.)

ఇస్లాం మతంమే ఇత్తెహాదుల్ బల్‌వస్తాదుల్‌హై
కాశీం రజ్వీకీబాత్ దిల్‌మే బల్ ఖుషీహై
(అని గేయం పాడుతుండగా)

రజ్వీ—అచ్ఛా! ఆచ్ఛా! బహుత్ మీఠాగానాహై. హీమిక్క హీపూట మాకీసాత్ హుంచీపొండి. బల్ బహుమానం హిచ్చి పంపిస్తాం.

పండిట్—చిత్తం! అట్లాగే! తమ అనుగ్రహానికి పాత్రులమై వుండి పోతాం.

రజ్వీ—హది కాదూహాంజీ! మీకీ హెల్ప్, భువన్‌సుందరికి హేంచీ పొమ్మంటున్నాం.

పండిట్—అట్లాగే హజరత్‌జీ, తర్వాతనే మీరు పంపించండి.

రజ్వీ—మీకీ హేమ్లియా ఫర్వాలేదూహాండీ! బల్ జాగ్రత్తగా మీకీ పంపిస్తాం'

(ప్యూన్ విజిటింగ్ కార్డు ఒకటి తెచ్చి రజ్వీ ముందు పెడ తాడు. రజ్వీ విజిటింగ్ కార్డు చూచుకొని ప్యూన్‌తో లోప లకి తీసుకురా అని చెప్పి పంపిస్తాడు)

(దేశముఖ్ మీరాలు సలాములు పెట్టుకొంటూ వచ్చి నిలబడతారు. పండిట్ రావు, భువనసుందరి ఒక ప్రక్కగా వెళ్ళి వింటుంటారు.)

రజ్వీ—క్యా దేశముఖ్ సాబ్! తుంహారా జిల్లామే క్యా సమా చార్ హై?

దేశ—(కవరులోవున్న వుత్తరంతీసి టేబుల్ మీదపెట్టి) బహుత్ హై సాబ్.

రజ్వీ—బైఠీయే! బైఠీయే! (హుక్కా తాగుతూ చదువుకొంటూ వుంటాడు)

(దేశముఖ్ మీరాలు కూర్చుంటారు. దేశముఖ్ ధనపుసంచుల్ని, నగా నాణాల్ని, విడదీసి ప్రక్కన పెడుతుంటాడు)

రజ్వీ—అచ్ఛా! మాలుంహై. హైతే మీవరంగల్ జిల్లామొత్తంమీదా మీ మీరాసాహెబ్‌ని పోలీస్ సూపరెంటుగా చేస్తుం డాం. మీకీ సబ్‌కలెక్టర్ పనీ పురమాయిస్తుండాం! దిల్‌మే స్టేట్ కాంగ్రెస్కీ, కమ్యూనిస్టుకీ అరాజకంహాణ్ణీపోయిఁటాకో

మీకీ హిస్సంహెూచ్చినట్ సిచ్చల్కీ హేయూవహెూచ్చు. మీకీ తోడ్గా మాదీ ఇత్తేహాదుల్ ముస్లిమీన్ వాలంటీర్సుని, సైన్యాన్కీ తుపాకుల్కీ పంపిస్తాం. మీకీ హేమ్టీ భయంలేద్. నీకీ హిస్టం హెూచ్చినట్ సావగొట్టి లెవీ వసూల్కీ సెయ్యండి. (ప్రక్కనున్న ఫోన్ సిగ్నల్ విని) టహీరో! టహీరో! (ఫోన్ హేన్డిల్ తీసుకొని, చెవిదగ్గఱ పెట్టుకొని మాట్లాడుతాడు) మేరానాం రజ్వీ నవాబ్ సాబ్... హై.. హై...జీహా...అచ్చా... (ఫోన్ హేన్డిల్ అవతలపెట్టి) నవాబ్ గార్కినుంచీ వార్తా హెూచ్చింది. హెూకొక్క సంవత్సరం మాహిస్టంహెూచ్చినటు మాతోహుంటాన్కి మా మాటాహింటాన్కి యిండియన్ యూనియన్ సమాధానం సడ్డాద్. మీకీహెూచ్చిన భయం హింకేమ్టీలేద్. జబర్దస్తీ సేసి లెవీ వసూల్కీ సేసి పంపిత్తూ హుండండి.

మన నైజాంరాజ్యంపే లచ్చ్చమందీ బడా సావుకార్లీకి-హై హైన్సే, లో హెూకొక్కక్కరీకి హెూల్లా మన నైజాం స్టేట్ కీ లచ్చా రూపాయల్ లెవీ సాలీనా వసూల్ వస్తూ హుంది. మీకీ వరంగల్ జిల్లామే కొంతామందీ బడా షావుకార్లూ బడా లెవీ సెల్లిస్తుండా హార్కి సాయంపాక్. హిప్డూ రాజంలో కాంగ్రెజీ హెూల్లా, కమ్యూనిష్ట్ సాకొంల్లా లేసిన గందర్గోళంహెూల్లా భయంపుట్టీ పైకం ముల్లేమూటా కట్టీ షావుకార్లూ హంతా హేడ్కీ హైనాలేసి పోతాస్తే మోహాని తోత్తూ హుండాద్. ముఖ్యంగా షావుకార్లనీ మన్కీ రాజ్జంలోంచీ ఖుసల్ నివ్వకండా జాగ్రత్తిగా సూస్తూ హుండవలా- మాలుంహై? మీరా, దేశ—జీ హా! మాలుంహై! మాలుంహై!

షావుకార్లూ కన్నా లేసిపోతే స్టేట్ కీ బహుత్ నష్టంకీ వస్తుంది. ధాన్కీ మట్టుకు చాలా జాగ్రత్తా హుండాలం. మీకీ ఖావల్సినా మిగ్తాసహాయం హంతా మాకీజరూర్ గా పంపిత్తూ సహైకీ సేత్తుంటాం. మాకీ మీకీ

హెప్పటక్కప్డూ సమాచారు తెలియజేస్తూ హుంటానికి వైర్లెస్ టెలిగ్రాం పంపిత్తూ హుండాం. ఇండియన్ యూని యన్కి మన్కి రాజీ ఖుదిరింది ఖన్నా రాజకీయ ఖైదీన్కి మన స్టేట్ కీ భయంలేని వాళ్ళని జైల్కినుంచీ జరూర్ గా హూఢ్డీ పెట్టవాలా. హిష్డ్రూ నవాబ్ సాబ్ తో మాకు జరూర్ కాంహై. వస్తాం. (అని లేవబోవును.)

దేశ—తమరొక పర్యాయం మా ప్రాంతాలకు దయచేయాలి.

మీరా—జరూర్ గా మీకీ దయ సేయాలా.

దేశ—మాజిల్లా ప్రజలు చాలామంది మీదర్శనం కోసం చాలా వేచుకపడుతున్నారు. తమ వుపన్యాసం వినాలని చాలా ముచ్చట పడుతున్నారు.

రజ్వీ—హైతే జరూర్ గా వరంగల్ జిల్లాకీ మై ఆవూంగా.

దేశ—తమరు దయచేసేముందు తిరిగి మీకోసం మేము వస్తాం. మాకు శెలవు దయచేయించండి.

రజ్వీ—అచ్ఛా! మీకీ హెళ్ళీరండి.

(మీరా దేశముఖ్ లు సలాములుచేసి నిష్క్రమిస్తారు. రజ్వీ షేర్వానీ, టోపీ ధరించి సిగరెట్ తాగుతూ నిష్క్రమిస్తాడు)

(తెరపడును.)

---

## రెండో రంగం—దేశముఖ్ దేవిడీ

(నరశింహాశెట్టి ప్రవేశం)

నర—ఎవరయ్యా దేవిడీలో! ఇంకా దొరగారు లష్కర్నుంచి గాలే దన్నట్లుంది. పెబువుగారులేని రాజ్జంగా వుండది. పిలిస్తే దిక్కూ దివాణం అగుపడ్డం లేదు. ఇయ్యాల్సినోళ్ళని పట్టి

కొందామని పయత్నగిత్తే యేడా వోడూ కనిపించకుండా పోతుండాడు. దివాణంగోరితో సెప్పుకొందామని వత్తి గంటా యాడ దిక్కుమొక్కు లేనట్టుండది. వోరూ పల కన్నా పలకటం లేదేమబ్బా! పిట్ట పీమమంటంలేదు. అటూ యిటూ చూచి ఉలిక్కిపడును) దివాణంలో జనానావోరు గూడా యేడకైనా పోయింద్రు గామోసు!

(దేశముఖ్ భార్య తాయారమ్మ ప్రవేశం)

తాయా—నువ్వేనా నరసింహ సెట్టి? ఎవరో అనుకొన్నా!

నర—మీరుండారండీ లోన! మీరుకూడా లమ్మురు పోయింద్రేమో అనుకొంటుండా.

తాయా—మాకేంపని పోవటానికి. మీకూ మీదొరలకే ప్రజల్ని పీసుకొని తినటానిగ్గాను ఘడియఘడియకీ లమ్మర్లూ, పట్నాలు పోయి రావలసిన పనిపడుతూ వుంటుంది.

నర—అంతేనండి అమ్మగారూ! యదార్థంగా సెప్తుండా గదా!...ఈ యుగంలో సత్తెప్రమాణంగా మా దొరగారంటి దొరగారు ఎన్ని జన్మలెత్తినా యీ పాపిష్టి పెజలకి దొరకరు. ఎన్ని బకాయిలు రైతుల్దగ్గఱ వసూలు సేయకుండా తీసిపారేసు కొంటుం డప్పటికీ యీ పాపిష్టి కాంగ్రెసూ కమ్యూని ష్టోరి బోధలమూలంగా వాడవాడకీ సెడిపోయే పచ్చిగ లొచ్చి పాడైపోతుంద్రె. యీ దిక్కుమాలినోళ్ళకి యెంత బుణంపెట్టినా యింగా సేతులోకి సిల్లిగవ్వ వచ్చేమార్గం అగిపించకుండా పోతుండది. యేం సేయమంటారు? సావ మంటారా! సర్కారోడికి పితూరీలు సేయకుండా? అందు కనే లమ్మర్కి దొరగారుగాని నేనుగాని పోతూవత్తుండది.

తాయా—మీరు మట్టుకేంజేస్తారు! ప్రజలు తెచ్చిపడేస్తుంటేనే మీరుగాని మీ దొరగారుగాని బండీనడిపిస్తారు. ప్రజలు

తిరుగుబాటు తెచ్చిపడేస్తుంటే మీషావుకార్లూ దొరగార్లూ కలసి నవాబుగారిదగ్గఱకు పితూరీలుచేయటానికిపోతుంటారు మఱి!...ఐతే...సరేగానిషావుకారూ! ఇంతఅన్యాయంగా రైతు లోగిళ్లలో జొరబడి, ఆడవాళ్ళను పట్టుకొని మాన భంగాలుచేసి ఇళ్లు దోచుకోవటం మితిమీరిపోతున్నదిగదా! మఱి అంతకష్టంలోపడ్డ కూలిరైతులూ, వాడవాడప్రజలూ మిమ్మల్ని, మీదొరల్ని విశ్వసించి ఎప్పుడైనా దగ్గఱకొచ్చే దుంటుందా?

సర—సత్తెమేగానండి, తాయారమ్మగారూ! మీరు సెలవిస్తే-పటు శాలా వూళ్ళలో గోల గొప్పగా లేసింది. యేవూళ్ళోనూ అడుగుపెట్టటానికి శక్యంగాకుండా వుండది. పెజ బాగా పసిపట్టటం నేర్చుకొంటున్రు. దివాణపోరంటే వురిమి మీద పడుతుంద్రుగూడా. అన్నట్టు—యీమధ్యనే కొన్ని వూళ్ళలో దివాణాలతోనూ, నవాబ్గోరితోనూ పెమేయం లేకుండా వాళ్ళంతటాళ్ళే రైతుకూలీలు రాజ్జెం తాపెంచు కొంటుంద్రు. ఆడకీ, నవమాసప్రుడు వోడూ పోకుండా వుండేట్టు పెద్ద కాపలావోళ్ళగూడా పెట్టుకొండారంట. ఈ దిక్కుమాలిన కాంగ్రెస్సోరి మూలంగా, కమ్యూనిస్టోళ్ల మూలంగా బాకీ లెగ్గొట్టడం, పనుల్లోకి రాకుండా మాటి మాటికీ సమ్మెలుచేసి కూకోడం—యవరికివోరు పెబువులు మాదిరి రాజ్జెలేలుకోటం మొదలు పెట్టింద్రు. అందుకనే, యీ యిలయంలోంచి నవాబుగోరి రాజ్జెం బయట పడేయ టానిగ్గా మోను మాదేశ్ముఖ్ బాబుగోరు సాలా తం టాలు పడుతుంద్రు. సైంగా యింకో యిలయం వచ్చి పడుతుండది. నావాడపట్టు సావుకోర్లంతా చుట్టుపట్ట బ్రిటీషోరి రాజ్జంలోకి లేసిపోతుంద్రని యిన్నా. ఇంగా బాబుగోరివ్వాల్సిన మొత్తం జమాఖర్చులు బాబుగోరొచ్చి నాక సూసుకొని నేనుగూడా యేడకో లేసిపోవాలని నాదారి

నేనుగూడా సూసుకొంటుండా.

తాయా—బోలెడు డబ్బుపోసి మొన్న మొన్ననే కట్టుకొన్నావుకదా పెద్దమేడవంటి మేడ! అదేంచేసి పోతావ్?

నర—దిక్కుమాలినోళ్ళంతా వచ్చిపట్టాసికి వదలిపెట్టిపోతా. మరి యేం సేయమంట్రు? వూళ్ళో ఒక్కనిముసం నిల్సేటట్టుగా, రైతుకూలీలముంగల ఆగేట్టుగా యేడా అగుపడ్డంలేదు. బతికుంటే బలుసాకైనా తిని బతకొచ్చు. రోజురోజూ మాయీదినే రామరావణాయుద్ధాలూ, కౌరవపాండవ యుద్ధాలూ హెచ్చైపోతుండై. సుల్లేకుండా మాయింటిల్లిపాది కళ్లు భైరవులు కమ్ముకుండై. పెద్దా చిన్నా తేడా లేకుండా వొకటే అమ్మవారి జాతర సేత్తుండ్రు. యీ పెళయంలోంచి యీ కడకుముంగలే సాలా బాగం సొత్తు సుట్టుపట్టు బ్రిటీషోరి వూళ్ళల్లోకి సేరవేసుకొండా. మళ్లీ దేశం భగవంతుడి దయవల్ల సల్లబడ్డప్పుడే వచ్చి మేడ సూసుకొంటా. యేడకిపోద్ది? నామేడ నాకే వుండద్ది. నాదికాదని వోరంటారు?

తాయా—ఇహా నీదారి నీవు చూచుకొంటున్నప్పుడు మాదివాణాల దగ్గరికి రావటం యెందుకు? ఇటు మాదివాణాల్ని కనిపెట్టుకొని వుండక, అటు నీకుతోడుపడి పెద్దషావుకార్ని చేసిన కూలిరైతుల్ని కనిపెట్టుకొని వుండలేక దేశం వదలిపెట్టి పోదలిచావు. ఇహా, నీ వొక్కడవే బ్రతికేవాడవు - మేమంతా పోయేవారమన్నమాట.

నర—అదికాదండీ! నావంటి అశిపిరికి సన్నాసోణ్ణి, యీడ నాపిల్లనీ జెల్లనీ యే విదంగా యేం సూసుకొని గచ్చించుకొంటూ వుండమంట్రు? అందుకనే నేను లేసిపోతుండానని సెప్పికొంటానికొచ్చా. దివాణపోరు నాకియ్యాల్సిన మొత్తం తీసుకుపోదామనొచ్చా.

తాయా—సరే, అక్కడెక్కడో సోదిమనిషి కేకవినబడుతున్నది. విను.

(రాము సోదిశింగివేషం వేసుకొని తట్టనెత్తికెత్తుకొని తెరలోపల సోదికేక పెడుతుంది.)

(శింగి—సోదోహ్యమ్మ సోద్దో ! సోదిసెప్పు కొంత్రమ్మ సోద్దో !)

తాయా—ఆ సోదిమనిషిని ఒకసారి కేకెయ్యి నరశింహాశ్రేష్టి.

నర—(లేచి) ఒసేయ్! ఓ సోదిమనిషీ ! ఇట్రా-ఇట్రా-ఇట్రా, దివాణం లోకి రమ్మంటుంద్రు.

(శింగి ప్రవేశం)

శింగి—సోదోహ్యమ్మ సోద్దో! దేసక్కైనా సెప్తా సోద్దో! గాలికైనా సెప్తా. ధూళికైనా సెప్తా సోద్దో. ఉండదుండట్లూ, శెందిలేనట్లూ సెప్పగలనమ్మ సోద్దో. నూటొక్క కోశ్కలీక్క సెప్తా సోద్దో.

నర—సరేలే! అన్నీ సెప్తువుగాని, తట్టదింపుకో, అమ్మగారు సోదడుగు తారంట.

శింగి—(తట్ట దింపుగుని) ఓ యల్లబ్బ! సెప్పకేం సోద్దో. నాది మూడు లోకాలకీ గద్దె. మూడు యిగాలకీ గద్దె. మానంగడంలో తరతరాల్నుంచీ గద్దెవుంది. మొనక మాజేజి సెప్పింది. మాహమ్మ సెప్పింది. దానిమీద నేసెప్తుండా సోద్దో.

తాయా— సరేలే! ఇదివరకు నీవు యెవరెవరికి చెప్పావ్?

శింగి—హోహో! అల్లదిగో ఆసంములో ఆమెకు సెప్పా సోద్దో. యిల్లి గొందిలో ఆమెకు సెప్పా సోద్దో. ఆనడీదిలో ఆమెకు సెప్పా సోద్దో. ఆ బాడ్రాతికాడామెకు సెప్పా. వోబాయి కాడామెకీ సెప్పా. దేవుడు సలామేలుసేస్తే ఇల్లిదిగో యీసీకిరి కళ్లామెకు సెప్పా. మరేమండాగాని ఆముండ మోపామెకు సెప్పా. ఇదిగిదిగిదిగో ఆ సాయబ్బుని లేవ

దీసుకొచ్చి నామెకు సెప్పినా.

తాయా—సరే! మంచివాళ్లకే చెప్పావ్. అంతా పెద్ద ఘరానాగల ఆసాములే!

శింగి—యిను థల్లే! పేరుబోయిన వాండ్లకే శెప్పా. అయిగోద్దిలో సీతమ్మకు శెప్పా. సత్తెబామెకు శెప్పినా. అల్లక్కడ రాజమ్మకు సెప్పా. సెన్నపట్టంలో తిలకమ్మకు సెప్పా. కన్నాంబకు సెప్పినా. ఇల్లగిక్కడ పార్వతమ్మకు సెప్పా. ఆల్లదిగో రాజమండ్రిగాడ మవ్వారి సుబ్బమ్మకు సెప్పినా. గీళ్ళందర్కి ఖద్దరు నూలుపోగు సుట్టి అంత్రం గట్టినా నాథల్లె.

తాయా—సరే, నీనూలుపోగుయొక్క మహిమ, నీసోది మహిమ యేమిటో కాస్త చెప్పు.

శింగి—యిను థల్లె! దేవతలకే మొక్కి అంత్రానికి ఖద్దరుపోగులు నలుపూ యెరుపూ, తెలుపూ మెలిపె మూడు సుట్లు సుట్టి యీళ్ళం దరి దండ సేతికి కట్టేతల్కి యీళ్ళంతా సివాలు పెరిగి యిళ్ళువాఖిళ్ళొదిలి దేశమ్మకాకులై కేర్లోహాని తిరుగు తుండ్రు!

తాయా—మంచి యంత్రాలే కట్టచేసుస్తున్నావ్ గాని మాగ్గూడా చెప్పు. ఇళ్లూవాకిళ్లూ వదలిపెట్టి దేశమ్మగాకులై పోయిన వాళ్ళ మాదిరి మమ్మల్ని మట్టుకు సన్యాసుల్ని చేయబోక.

శింగి—నీకేవమ్మ మారాజు బిడ్డవు. పెట్టిపుట్టినా థల్లివి. తెనుగు థల్లివి. లోకాలన్నీ ఫాడైనా వసిమై మార్నమైపోయినా నీవు గడపదాటవు. నీ యిల్లేమో, నీయాకిలేమో, నీబిడలేమో, నీగొడ్డులేమోతప్ప నీకేమీకాట్టదు, బీరపాదు పూసినట్టు నగలు పెట్టుకొని కులుకుతూ కూకుంటవు.

తాయా—సరే! అయితే యేమిటొ చెప్పు. యేంచేయమంటావ్?

శింగి—ఓహ్యామ్మా! యేమిస్తవు. నాకేమి మేడలిస్తవా- మాడలిస్తవా? అమ్మోర్ని ముడుపుకే మూడుపావలాలు రొఖమియ్యి. గస్తె కింద మానెడు సోలెడు బియ్యం పొయ్యి.

తాయా—సరేలే, అన్నీ యిస్తాను చెప్పు.

శింగి—సరే ఖూకోవమ్మా. ఎంత భోగొట్టినా పెట్ట జెదిరి పోధుండదు. దొరసానికి నేను సోది భాగా సెప్పనేమోనని బయమేత్తుం డది, ఆనిత్తే అడిగిన దానికింకా ఎక్కువే యిస్తది. ఖూకో థల్లె. చెయ్యిచ్చి ధండం పెట్టుకో థల్లా,

ఓహ్యామ్మ! కొల్లాపురియెంఖమ్మా!
యేడుకొండలవాడ యెంకటేచ్చర్లా!
సింహాద్రి నారుచింహసామీ! అంకమ్మథల్లే!
పలికిభోంకవద్దు! ఆడిధప్పవద్దు!
పలికిభోంకపద్దే మాహ్యామ్మా!
మాలకొండలసామి! కోటయ్యకొండసామి!
యేడుకొండలసామీ! పార్వతీపరమేచరా!
మంగళగిరి నరచిములా! పెదవోబళయ్యా!
బెజవాడకనకదురగమ్మా! పుల్లథిన్నగాపట్టుకో థల్లే!
కొల్లాపురమ్మా! లోకానయెలిసిన నూటొక్క సత్తుల్లారా!
గుంటూరుమత్తావయ్యా! ఆడిధప్పవద్దు! పలికిభోంకవద్దు!
వుండదుండట్టు లేందిలేనట్టు సెప్పనేహమ్మ!

నీవు దయ్యాన్నివో భూతాన్నివో సెప్పవేథల్లే! .... నేను దయ్యాన్ని గాను భూతాన్నిగాను, పీడనుగాను, పిశాసినిగాను, పీనాసినోణ్ణిగాను, ఘొల్లమంద కోటయ్యనుగాను నల్లమందు కాశయ్యనుగాను.... ...

తాయా—మరెవరివి?

శింగి — నే నెవర్నో సెప్పమంటవంటే థల్లే!

తాయా—చెప్పు మరి.

నర—చెప్పవే, చల్లకొచ్చి ముంత దాచుకోడ మెందుకు?

శింగి—సెప్పబోతె సిగ్గవుతదే థల్లే!

తాయా—సిగ్గైయితే ఎందుకొచ్చావ్? మనసూ, సిగ్గూకూడా అయితే యెట్లా? బయటపడు.

శింగి—అదిగాధే — నేను పరువుగలధాన్నే థల్లే! నాబతుకుముండ ముత్తయిదు కాకుండా పోయిందే థల్లే! నాకుఆవేదన యెక్క వైందే థల్లే!

తాయా—ఎందుకు ఆ వేదన?

శింగి—నాకు వల్లమాలిన ఇత్తేహాదుల్ పిశాచం పట్టిందే మాహామ్మా.

తాయా—ఇంవాక పిశాచం కాదంటివిగా?

శింగి—అదిగాధే థల్లే! నేను దేశమ్మ థల్లినే మాహామ్మా! నాకు నవాబు పిశాచి పూనిందే థల్లే!

తాయా—ఎక్కణ్ణుంచొచ్చింది?

శింగి—ఒక్కటి.... రెండు .... మూడు .... మూఢంటే థెలియదంటే మాథల్లే! మూడో ధిక్కునుంచొచ్చిందే మాథల్లే! పడమణ్ణుంచి వచ్చిందే మాహామ్మా! ఆపైన పాకీత్తాన్ గాలి సోకిందే. మాథల్లే! అణ్ణుంచి మాహామ్మా! పూరూరా వడగొట్టి పడఘూట్టిందే మాథల్లే!

తాయా—ఏం చేసింది?

శింగి—యేంజేసిందో సెబుతుండా థల్లే! పస్తైలడుగుతదే మాథల్లే! నా బిడ్డలకీ నాకూ యడలుబాపిందే మాహామ్మా! దేశముఖో ళ్ళని కల్పుకొని నవాబు పిశాచం నామీాదా నా దేశంమీాదా దండెత్తిందే మాహామ్మా! సివరికి నా దేశముఖోళ్ళనికూ డా

బుట్టపెట్టుకొందామని సూస్తుండదే మాహామ్మా! గొప్పో
ళ్లందర్ని తరాజులు చేస్తదే మాహామ్మా!

తాయా—దేశముఖులంటున్నావ్ యేమిటి? తిన్నగా చెప్పు!

శింగి—సెప్పుకొత్తుండాను ధిన్నగా హినవే థల్లే! గెడ్డమంటె బుడ్డం బొడ్డమంటే గెడ్డమే మాథల్లే! దేశాన్ని నాశనంచేసి పొట్ట నెట్టుకొందామని తలుత్తుండా నవాబు కాడకిపోయిన మీ నిగామాను ఖూరాసాహెబు ధల్లే! యోగామేకై వత్తుండదే థల్లే! పెద్ద అదిగోరం గడించుకొనొత్తుండదే థల్లే! మిగిలి గామాను మీరాసాయబ్బుగోడ్కి వచ్చిపడ్డ అధికారమంతా రెండుకళ్ళా పూడిపోయి థల్లే! దేశముఖ్ గోర్ని గూర దేశానికి లేకుండాసేసి థల్లే! నిన్ను సెరలుపెట్టాలని సూస్తుం డదే థల్లే!

నర—ఆ...ఆ...ఆ...అంత యిలయమే! అంత యిలయమే! అయితే శావచ్చుకూడా, నాకీయుంటి ప్రాప్తమానం యెడిసుకొన్న దుకుతుండది కూడా.

శింగి—యినవే మాహమ్మా!....

తాయా—ఇకచాల్లె కట్టిపెట్టు సోది. భాగానేవుంది.

నర—తాయారమ్మగారూ! నేను సత్తెప్రమాణంగా సెప్తుండా. ఇయాల తెల్లారిగట్ట సూస్తానుగిందా— బుడబుక్కలోడు సెకునాలు సెప్పుకుంటావొచ్చి యీసూరిగే సెప్పుకొ చ్చిండు, ఆపైన తెల్లారినోక మల్లీసూస్తానుగిందా— సొంత గుడ్లలోడాకడు యెదురై సూసినమే సెప్పుకొంటా పోయిండు! తాయారమ్మగారూ! మీకొట్టానికోసం పెట్టు బట్టి ముందస్తిగానే జాగ్రత్తపడి మాదేశముఖ్ గోరికి యీ వృత్తాంతమంతా సెప్పి మీరాసాయబ్బుగోర్ని యీపూరి మీదలేకుండా ఈదేశంమీదలేకుండా యములోళ్ళదగ్గరికి పంపించావంటేమాతల్లీ! నీపేరుచెప్పుకొని మేమూ బతు

కుత్తాం.— మీరాదివాణం పేస్తూ, మీరా కీర్తి సెప్పుకుంటాం తల్లీ!

తాయా—అంతే చేయాలి. నిజంగా లష్కర్నుంచి రాగానే యీసిగా మాన్ నిజాంగాడు పన్నబోతున్న కుట్రంతా మీ దేశముఖ్ గారికి చెప్పి, యీ నిజాంగాణ్ణి దేశానికిలేకుండా చేయిస్తా. నన్నా— నా దేవుణ్ణి— నా దేవిడీని— నా దేశాన్ని పొట్టపెట్టుకొందామని చూస్తున్న కర్రాణ్ణి యింకా వుండనిస్తానా! పదవే పోచమ్మసిసీ! దొర్లోకిపద, నీకియ్యవలసినది యిచ్చిపంపిస్తా. నరసింహశెట్టీ! నీతో అవుసరంకబురుచేస్తాం. నీవు ఎక్కడున్నా తప్పకుండా రావాలి.

నర—లష్కర్నుంచి దేశముఖ్ గోరు రాంగానే మా బాకీ సంగతికూడా కొంచెం పట్టుబట్టి సెప్పండి తల్లీ!

తాయా—అల్లాగే! వస్తా.

(అందఱూ నిష్క్రమిస్తారు. తెరపడును)



# చలో హైద్రాబాద్

## చతుర్థాంకం

### ఒకటో రంగం—కోటారెడ్డి యిల్లు

(ఉయ్యాల్లో బిడ్డణ్ణి పెట్టుకొని రుద్రమ్మ జోలపాట పాడుతూవుంటుంది. కోటారెడ్డి కుర్చీలో కూర్చొని పత్రిక చదువుతూ వుంటాడు.)

**కీర్తన**

రుద్రమ్మ — నా నోముతోటలో నా చిట్టకోయిలా
రాగమధు కేరటాల ఊగుటుయ్యాలా ॥నానోము॥
విశ్వ సౌందర్యంబు విందులోనరించి
తియ్యని పీకళలు దిశల వెలిగించు ॥నానోము॥
నవరత్న తొలకరిని భువనాలకులికించి
తెనుగుతల్లి గృహాసమణులుపరపించు॥నానోము॥

కోటా...ప్రభలో, ప్రజాశక్తిలో మన స్వతంత్ర పంచాయితీ రాజ్య ప్రకటన బాగాపడింది.

రుద్రమ్మ...ఏదీ! ఏదీ! మన ప్రచారం విషయాన్ని బాగా ప్రకటిస్తున్నయ్యన్నమాట! (చూచి) మొన్న తీసుకొన్న ఫొటోకూడా పంపించారు కాబోల్ను, వెయ్యలేదేం?

కోటా—ఒకప్పూరు వార్తలా—ఒక రాష్ట్రివార్తలా! ఎన్నెన్నో రోజు వారీగా వచ్చి పడుతున్న వార్తల్ని యీవార్తా పత్రికల కెక్కించి తెల్లవారేటప్పటికి దేశాని కందించటం చాలా కష్టమైన పని-చాలా ఖర్చుతో కూడుకొన్న పని. ఇంకా నయంకాదూ—యీమాత్రం వేశారు.

రుద్రమ్మ—రేడియో వార్తల వేళైంది కాబోల్ను, రేడియో పెడ తారూ?

కోటా—(రిష్టు వాచి చూచుకొని) అయ్యిందయ్యింది. వన్ మినిట్. (అని దగ్గరున్న రేడియో బటన్ త్రిప్పును. రేడియో సంగీతాలు కాస్సేపు మ్రోగును) ఇదిగో! ఇహాను విను. వార్తలు చెబుతున్నారు.

(ఇద్దరూ వార్తలు వింటుంటారు)

రుద్రమ్మ—(ఆత్రంతో) యేమిటీ? గాంధీగారు.. ...!

కోటా—(ఆశ్చర్యంతో) ఒక పిడుగువార్త ఇవాళ రేడియో చెప్పింది. మన విశ్వగురుదేవుడైన మహాత్మా గాంధీగారు అకాల మృత్యువాత పడ్డట్టు చెప్పింది.

(రుద్రమ్మ తటాలున కుర్చీలో చతికిలబడి మాటలేకుండా పడివుంటుంది)

కోటా...ఏమిటీ! వింటున్నావా? అట్లా పడ్డావేమిటి? (లేచి రేడియో ఆపి రుద్రమ్మ చెయ్యిపట్టుకొని చూస్తాడు) చూస్తున్నంతలోనే చాలావిషమ పరిస్థితి వచ్చిపడదే!(ఉయ్యాల్లో ల్లవాణ్ణి యెత్తుకొని) నాచిట్టితండ్రీ! మీఅమ్మని పలకరించు.ఇదిగో! అబ్బాయి పిలుస్తున్నాడు, ఇట్లాచూడు.

(పట్వారీ పంతులు ప్రవేశం)

పంతులు—ఏమోయ్ కోటారెడ్డి!

కోటా—కాస్సేపు మాట్లాడకండి పంతులుగారూ!

పంతులు—యేమిటట్లా పడుకుంది?

కోటా—యేముందండి, మన జగద్గురుకులైన మహాత్మాగాంధీగారు మరణించారు.

పంతులు....అవునట! నే నిందాక వచ్చేటప్పుడు రేడియోలో చెప్పారట విన్నాను. ఎవడో మతోన్మాదుడట! దివాల్వరుతో ప్రార్థనకి బోతున్న మహాత్ముణ్ణి కాల్చాడని చెప్పుకొంటున్నారు.

కోటా—(కన్నీరు తుడుచుకొంటూ) అవును, ఇంకా మేమంతా తండ్రి లేని బిడ్డలమైనాం. కారు అంధకారంలో మునిగిపోయాం.

రుద్రమ్మ—(స్పృహ దెచ్చుకొని) ఉన్నారా యిక్కడ! కొంచం మంచినీళ్ళందుకోండి.

(చేతిలో పిల్లవాణ్ణి ఉయ్యాల్లో పడుకోబెట్టి కోటారెడ్డి మంచి నీళ్ళు తీసుకురావటానికి పోవును)

పంతులు—అమ్మా రుద్రమ్మతల్లీ! అదేమిటమ్మా? యేమిటో ఆయాసపడుతున్నావ్!

(కోటారెడ్డి మంచి నీళ్ళతో ప్రవేశం. మంచి నీళ్ళు రుద్రమ్మ కిస్తాడు. రుద్రమ్మ మంచి నీళ్ళు కాసిని పుచ్చుకొని కుర్చీలో అట్లాగే కూర్చొని వుంటుంది.)

కోటా— మా మహాత్ముని చల్లని ప్రేమకురిసి
పరుగు లిడుచున్న దివ్య జీవ నదులన్ని
జలధి భీకర సంక్షోభ జగము గనగ
వసుధ నెంత పిడుగువంటి వార్త పడెర॥

పంతులు—నిజంగా పిడుగువార్తే కోటారెడ్డీ!

రుద్రమ్మ...అబ్బాయి నిట్లా యివ్వండి.

శాంతా—ఊయ్యాల్లో పడుకొన్నాడు లే. కాస్సేపు విశ్రాంతి తీసుకో. ఓహో, ప్రపంచానికి శాంతి సందేశం యిచ్చే దాత యేడీ?

నలుఁదికోట్ల పుత్రులను
నాల్గుయుగాల వరాలనోము పం
టలుగ ఫలించుకొన్న రతనాల
గృహాంబున పెద్ద గుంతమున్
నిలువున వేయబడ్డదిక
నిల్పుదు భారత వృద్ధమాత యూ
కుల మత జాతి రక్కసుల కొంప
మహాత్ముని దక్కనిచ్చునా॥

శాంతలు—పోనీమో నాయనా, అటువంటి జగత్ప్రఖ్యాతపురుషుడు మన కాలంలో యింకా అవతరిస్తాడంటే నాకు నమ్మకం లేదు.

రుద్రమ్మ—మహాత్ముడు; మానవజాతికి యావత్ప్రపంచమానవకోటికి చేసిన అహింసా శాంతి సేవ మరువగలమా?

సదిలముగా దురాగ్రహ ప్రవాహము
నాపెడి కట్ట గండి ప
డ్డది, మొగబడ్డ వాహిని ఎడారిగ
జేసెడిదాక యింక తే
లదు మన వీరభారత కళానవరత్న
హిమాలయంబు, యీ
కుదురున శాంతిదాత మనకున్
శత జన్మలికైన మొల్చునా॥

కోటా—ఇంకా మనకు అటువంటి మహాత్ముడు శత సహస్ర జన్మల కైనా దొరకగలడా ? అయ్యో ! సరిగా ఉపవాసం మాని నాలుగురోజులుకాలేదే !

నిరశన వ్రతమును మాని సరిగ నింక
కొలుకొనని ఈముదిమి వొగ్గుపయి నకట !
యిల తుపాకి కాల్చగ చేయి యెట్లువచ్చె ?
వెఱ్ఱివాడ ! నీకేల యీ పిచ్చి పుట్టె !

పంతులు—వాడెంత మూర్ఖుడో! నిట్టసలున్నా ప్రాణం తీసేవాడు పుట్టుకొచ్చాడు భూమ్మీద.

రుద్రమ్మ—మీ నిజాం నిరంకుశ రాజ్యంలో మతోన్మాదంతో బలిసిన ఇత్తేహాదుల్ మత్తేభాలతో సమానంగా పుట్టుకొచ్చిన మూర్ఖుడై వుంటాడు.

పంతులు—ఏమిటో! మన నిజాం నవాబువంటి పిచ్చిమారాజు ఇంకోడు లేడు. అక్కడక్కడ చెడ్డపురుగులు పుట్టుకొచ్చి ఇటువంటి అప్రదిష్టలు తెచ్చిపెడుతుంటై. వెనకట్ల లేదు రుద్రమ్మ తల్లీ! ఇప్పుడంతా మారిపోయింది. నిజాం కోటలో, దేశ ముఖ్ గారి దేవిడీలో వారి చెప్పుచేతల క్రింద తిని బ్రతుకు తున్న మావంటివాళ్ళ యిళ్ళల్లో ఆ మహాత్ములవారి దివ్య సందేశాల్ని బట్టి యిప్పుడంతా యీ ఖద్దరుబట్టే కట్టుకొం టున్నాం. అదీగాక, నవాబుగారికి, గాంధీగారి శిష్యులైన పటేల్ గారికి యేదో సామాన్యంగా ఒక సంవత్సరపు ఒడం బడిక కూడా కుదిరింది. ఏదో శాస్త్రకాస్త యిప్పుడే దారికి వస్తున్నాం. ఐతే కోటారెడ్డీ! ఒక మాట చెబుతా విను. అసలు యీమాట చెప్పి పోవటానికే వచ్చా.

కోటా—యేమిటో శెలవియ్యండి!

పంతులు — ఐతే, యీమధ్య మీరూ మీనాయకులూ కలిసి ప్రకటించిన స్వతంత్ర పంచాయతీ రాజ్య ప్రకటన నిజాం హుజూరుకు కూడా పోయిందనుకొంటా. ఐతే. దానికేం గాని నీవు బుద్ధిమంతుడవు, స్వతంత్రుడవు, స్థితిమంతుడవు. నీకోరకు చెప్పాల్సింగేముందిగాని నీపలుకుబడినిబట్టి, నీవంశకీర్తినిబట్టి, నైజాం నవాబుగారు యిద్దర్నీ కూడా చాలా పెద్దగా బహూకరించాలని తలచారు. మీరు మీ దేశముఖ్ బాబుగారికి చాలా కావలసినవారూ దగ్గరివారూనూ. మీకు కూడా వారితోబాటు సమానమైన పెద్ద జమీ వొకటి యివ్వాలని నైజాం నవాబుగారికి త్రికరణశుద్ధిగా బుద్ధి పుట్టింది. మీరు స్వతంత్రం ప్రకటించుకొన్న యీ అయిదారు గ్రామాల్నీ మీయేలుబడిలో వుంచుకొని మీరు లేవీ వసూలుచేసి మీపెత్తండ్రి కొడుకైన దేశముఖ్ బాబుగారితోపాటు సంతోషిస్తూవుండండి. వూళ్ళల్లో యేగోలా లేకుండా చూడండి.

కోటా — పంతులుగారూ! మీరు తెలపిచ్చుకొచ్చినవన్నీ కేవలం స్వార్థం కోసం రాత్రింబవళ్ళు పాటుబడుతున్నవాళ్ళకి బాగా రుచిస్తై. ఉపకరిస్తై. అంతేగాని మేము మీసలహాలకి, మీదయాదాక్షిణ్యాలకి లొంగిపోయి ఇట్లా సంఘాలు పెట్టుకొని ప్రజాసేవ చేయటంలేదు. ఇప్పుడు మేము ప్రకటించుకొన్న స్వతంత్ర పంచాయితీ రాజ్యం కేవలం మేమూ, మా పెళ్లాం బిడ్డలు అనుభవించటానిగ్గాదు. ఈస్వతంత్ర పంచాయితీ రాజ్యంలో అందరికీ కుల, మత, జాతి, వర్గ, పార్టీ విభేదాల్లేకుండా, హెచ్చు తగ్గులు లేకుండా సమానమైన అధికారం వుంటుంది. సుఖజీవనం వుంటుంది.

పంతులు — ఇదిగో! కోటారెడ్డీ! కొంచెం నేనెందుకొచ్చి యిట్లాచెప్తుతున్నానో కాస్త పారజూచుకొని మాట్లాడు.

రుద్రమ్మ—మీరు చెప్పుకొస్తున్న మాటలకూ, యిన్నాళ్ళూ మీరు తెచ్చిపడేస్తున్న మాటలకీ మేమూ, మా ప్రజలం పారజూచుకోకపోతే ఎట్లా? మీ నిరంకుశ పశుబలం, మానవ మారణయంత్రబలం సన్నగిల్లి, యీనాడిట్లా మీ మేడమిద్దెలు దిగి మా దగ్గిఱకొచ్చారుగాని కేవలం మా బక్కచిక్కిన రైతుల మీదా మా కూలి ప్రజానీకం మీదా దయపుట్టి రావటం లేదు. అట్లా యెప్పటికీ రారుకూడా. అన్యాయంగా, అమానుషంగా మీ నిరంకుశ ప్రభురాక్షసబలం గ్రామాల మీదపడి పెద్దజాతరచేసి పారేస్తున్నప్పుడు మీవంటి మహానుభావుడు యిట్లావచ్చి చెప్పినట్లైతే కాస్త విశ్వాసమూ వుంటుంది-వినవలసిందీ వుంటుంది.

పంతులు—ఉపకారానికి పోతే అపకారం యెదురైందన్నట్లు మంచికి పోతే చెడ్డ మీదొచ్చి పడుతున్నది. నాకెందుకు? నేను చెప్పాల్సినవేవో చెప్పా. ప్రభువులు బలహీనులేమాత్రం కాదు. మీరు స్వతంత్ర పంచాయితీ రాజ్యం ప్రకటించుకొన్నంత మాత్రాన వారు ఝడిసి విడిచిపెట్టేది లేదు. మధ్యలో నేనెందుకు మాట పడటం. నాదారిని నేనుపోయి వస్తాను. యేదో పెద్దవాణ్ణి గనుక, మీ తాత తండ్రుల నాటి నుంచీ వస్తున్న మర్యాద కాస్త తెలిసినవాణ్ణి గనుక యేదో చెప్పిపోదామని వచ్చా. వెళ్ళొస్తా.

(అని నిష్క్రమిస్తాడు.)

రుద్రమ్మ—ఇంత తీవ్ర ప్రజాపోరాటాన్ని మనం అహర్నిశం ప్రతిజ్ఞ బట్టి సాగిస్తున్నాం గనుకనే యీ కిరాతకులైన నిజాం ప్రభుత్వం వారికి దారీతెన్నూ యేమీ కనబడక యిట్లావచ్చారు. మరి మన మహారాజశ్రీగారి అహింసాసూత్రాన్ని పట్టుకొని, ఆలోచనమార్గాన్ని బట్టుకొని నడుస్తున్నాం గనుక యీనాడు యీ గమ్యస్థానాని కొచ్చాం.

కోటా—నిజం! నిజం! అంతే.....మన గురుపుంగవులైన మహా రాజశ్రీగారు చెబుతున్నట్లు మన దేశములోని ప్రతి పార్టీ నాయకులు, కుల, మత జాతి వర్గ, పార్టీ భేదాల్లేకుండా ఒక దారిబట్టి నడచినట్లైతే యీ నాటికే నిజాం కోట మీద ధర్మచక్ర పతాకం కట్టేవాళ్లం.

రుద్రమ్మ—సుమ్మాటికీ అట్లా చేసినట్లైతే జయం యివరికే సంపాదించివుండేవాళ్లం.......అసలు కేమిటి? ఈ పోయిన పంతులు వరంగల్ నుంచి మిలిటరీ సేమనా తెప్పిస్తున్నాడా యేమిటి?

కోటా—అయితే కావచ్చు. ఈ పంతులు అంతటి వాడు కాడాను.

(పట్వారీపంతులు, సూపరెంటు మీరాసాహెబ్, పోలీసులు ప్రవేశము)

పంతులు—ఇంకా నామాట నమ్ముతారో నమ్మరో అని సూపరెంటు గార్ని కూడా తీసుకొచ్చా.

కోటా—మిమ్మల్ని నమ్మక పోవటమేమిటండీ! మిమ్మల్ని, మీ సల హాల్ని నమ్మకుండానికంటే నమ్మకుండా వుంటేనే ఎక్కువ భయం.

మీరా—అదీ ఖాదోయ్ ఘూడ్వ! మాకీ హుజూర్ నుంచీ బల్ కితాబ్ హొచ్చింది. దీన్కి లేవో కోటారెడ్డీ.

రుద్రమ్మ—మాకెవ్వరి కితాబులూ, మతాబులూ అక్కర్లేదు మేం మా రెక్కల కష్టంమీద కలసి మెలసి హెచ్చుతగ్గులు లేకుండా కష్టపడి జీవిస్తుంటేచాలు. అదేమాకు పెద్దకితాబు.

మీరా—నీకీ హోడా ధాస్వి హేమ్మిాధెలూ హని మాటా సిత్రావ్! హోడదానీ మాటాహిాని సెడీ పోతాక్!

కోటా—చెడిపోతే చెడిపోయాంగాని మాకు మీ రాజీగారుపిాలా లతో నిమిత్తమేమీలేదు. మా నాయకులు తాచెప్పి నడి పిస్తున్న మార్గమే మాకు శరణ్యం.

పంతులు—ఇంతవరకు బాగా మేము చూస్తున్నా [illegible]!

రుద్రమ్మ—మానవ మాత్రులెవ్వరూ నడువరాని మర్గపారణ్యం.

మీరా—బాత్ కర్ సఖో! మీకీ హారెస్టు వారెంటు హమునై. మీకీ హిద్దర్కి హారెస్టు చేశా హిప్పూ. చలో! హేయ్ కాన్స్టేబుల్స్! బేడీల్కి హేసి లేజావ్.

(రుద్రమ్మ ఉయ్యాలదగ్గఱకుపోయి పిల్లవాణ్ణి ఎత్తుకొనబోతుంది. పోలీసులువచ్చి తలాలున చెయ్యిపట్టుకొని లాగి [illegible] బేడీలు వెయ్యబోగా కోటారెడ్డి అడ్డుపడు)

కోటా—ఛీ! క్రూరుడా! నీవు పిల్లల్ని [illegible] తల్లికీ బిడ్డకీ యెడంచేసి లాక్కుపోదామని చూస్తున్నావా?

మీరా—హాం! బాత్ కర్ సఖో బద్మాష్!

(కోటారెడ్డినికూడా పట్టుకొని యిద్దఱికీ [illegible] మీరాసాహేబు పోలీసులతో చెప్పును పోలీసులు రుద్రమ్మకు, కోటారెడ్డికి బేడీలు వేస్తారు. కోటారెడ్డి, రుద్రమ్మలు యిరువురూ సంకెళ్ళతో పెనుగులాడుతూ "నా పరాలపండ్రిని, నా చిన్నారి తెనుగు తండ్రిని ఒక్కమాటు చూడనివ్వండి." అని గోలపెడుతుండగా పోలీసులు లాక్కొనిపోదురు)

మీరా—(ఉయ్యాలతొట్టి దగ్గఱకొచ్చి పిల్లవాణ్ణెత్తుకొని ముద్దుపెట్టుకొని) అచ్ఛా బచ్చాహై పంతుల్ సాబ్!

పంతులు—అచ్ఛా బచ్చాలే! వీళ్ళ కొంపల్లోకి మోకాళ్ళ పగల గొట్టే బచ్చాలు, లుచ్ఛాలూను అవుతారు.

మీరా—హది ఖాను హైఁడీ! హిట్లా సూపూ హయ్యా! దేఖో లడ్కాకీ హెట్సంటి రాజ వచ్చనూ హుందో షూడూ హయ్యా!

రాజ్జంలో హిట్లా హొస్నా పానాల్కి తీసి నేను ఛత్కి హూంటాన్ !

**పంతులు**—“యద్భావం తద్భవతి” ఎట్లా అనుకొంటామో అట్లా అవుతుంది. నేనింతకుముందు చెప్పలా నవాబ్‌కి? అట్లాగే అయ్యింది నవాబ్ హూకుంటూనూ. చింతిస్తే ప్రయోజన మేముంది. మీలామాదిరి నామాదిరి రాజా భగవంతుడూ చింతిస్తూ కూర్చుంటే యెట్లా యీలోకాల్ని పాలించ గలుగుతారు ! రాజశాసనం, భగవచ్ఛాసనం సమానమైన వాడిగల ఖడ్గం పట్టుకొని నడుస్తుంటాయి. దానికి తిరుగులేదు- ఎదురులేదు.

**దొరా**—హారె బాత్‌కర్‌నకో బాపన్‌పంతుల్ ! సకీ ఘుండేకాదూ హయ్యా ?

(ఇంతలో ఆదుర్దాగా పోలీసు పరుగెత్తుకొని వస్తాడు)

**పోలీసు**—రాజాసాబ్ ! ఇంతకుముందే సంకెళ్లు వేసుకొని తీసుకుపోయిన కోటారెడ్డి రుద్రమ్మల్ని విడిపించటానికి మహాజనాన్ని యెవడో మహానాయకుడు వెంటబెట్టుకొనొచ్చి మామీద కలియబడి, కొట్టి, ఆయుధాలు లాక్కొని కోటారెడ్డిని, రుద్రమ్మని విడిపించుకొని యెక్కడికో పరారై పోయారు.

**పంతులు**—ఆ...ఆ....ఎంతపనికి సాహసించారు. ఈ కాంగ్రెస్ వాళ్లకి, కమ్యూనిష్టువాళ్ళకి సైన్యాలుకూడా వున్నాయా యేం? మా పోలీసుల మీదపడి, కొట్టి, ఖైదీల్ని విడిపించుకొని పోయారూ ! కానీయండి చెప్తా. సూపరెంటుగారు ! మీరింకా ఆలస్యం చేయకూడదు. ఆదరించ కూడదు. ఈసమయంలో మనవంటి ప్రభుభక్తి పరాయణులంతా సంఘటితులమై వుంటేనేగాని మన నిజాంరాజ్యం నిలవదు. పదండి.

**దొరా**—నాకీ హిదీ సూస్తే, అల్లా పెజల్ పతొన్కి సాయం సేస్తూ వాండాడ్ హాని తోత్తూహుండాడ్. దీన్కి సందేహంలేద్.

నాకీ నౌఖరి లేకపోతే లేకపోయె గాని నాకిదారి నాకీ మాని కుంటే మంచిద్.

పంతులు—— ఐతే, మీరిగ పిల్లవాణ్ణి చంపివారేయమని హుజూర్ నుంచి హుకుం వచ్చింది కనుక దేశముఖ్ గారి దేవిడీకి తీసుకొని పోయి వొప్పజెప్పి చేయాల్సిందేదో చేద్దాం పదండి.

మీరా——అంతేసేయాలి. నాకీ హూంచ్చినా భయం హేమ్మీలేద్. చలో

(పిల్లవాణ్ణితీసుకొని అంతా నిష్క్రమిస్తారు)

---

## రెండోరంగం——దేశముఖ్ దేవిడీ

(పూజామందిరం—దేశముఖ్ భార్య తాయారమ్మ పాటపాడుతూ ప్రవేశం)

——కీర్తన——

తాయా—— దేవుని దేహము దేశము గదరా
జీవుని ధర్మము సేవలు పదరా ॥దేవుని॥
దేశభక్తికి దేవునిభక్తికి
తేడా లేదోయీ
తియ్య తియ్యని కైతకోయిలా
దీని తీపితో—దేశము తేటగ జేయాలోయ్ ॥దేవుని॥

(పూజామందిరం ప్రవేశించి పూజచేస్తూ)

త్రిలోకైక మంగళ ప్రదాయినీ! కనకదుర్గా భవానీ!

——కీర్తన——

జననీ! బహు నిరుపమాన కరుణారస నిర్ఝరణీ
నిఖిలలోక పావని-సకలలోక మోహిని ॥జననీ॥

నీ చల్లని కెరటాల లోపలా
మేమెల్లర ముయ్యాల లూగగా
సేవించు చుంటి మమ్మా
దీవించ లేవటమ్మా ॥జన॥

మంగళకరమైన జగజ్జననీ! నీవు మహాజనశక్తిచే పూజింపబడు చున్న శుభ సుందర కళాప్రసూన జ్ఞానమాతవు గదా! నీ అవ్యాజప్రేమ దృష్టిచేత యావచ్ఛృష్టి పోషింపబడుతున్నప్పుడు నేను దేశదేశాల్లో, గ్రామగ్రామాల్లో దారుణ సంగ్రామ భయంకర దరిద్ర సంక్షోభాలు లేవటానికి హేతువేమిటమ్మా? నీకు దయాలేదా?

చల్లని తండ్రియింటి కడు
చక్కదనాల వరాల బిడ్డవై
పల్లవపాణి పద్మనవభాగత
సద్మ సతివు తల్లివై
యెల్లజగాలు మోసెడి మహీ
మహిళామణి రత్నగర్భలో
పిల్లలనింత దుర్గతిని
వేపెదవేమి త్రిలోక పావనీ !

మాంతాణాలు, మాప్రాణాలు నీసువర్ణ సుందర సింహాసన సంస్థాపనంలో హాయిగా స్థాయిగా నిలబెట్టుకొంటానికి ముడిపెడుతుంటిమే, గాని నీ అనుపమాన కృపారస దృష్టికి దూరాలమైతిమటమ్మా! నిన్ను నమ్మి నీమీద గంపెడపేక్ష పెట్టుకొన్న మా దివాణాలూ, మా నిజాం పట్టెటూళ్ళూ నేడు భయంకర బడబాగ్ని యుద్ధగుండంలోబడి దగ్ధమైపోతున్ననూ. నీకు కనుపించటం లేదా? నీవు కనికరించుటకు లేవా? కడకు ప్రభుభక్తి విశ్వాసాలుకూడా తప్పి రాజభటులు దురాశాపీడితులై

దేశ—నాకు మన మీరాసాహెబు కంటే పెద్ద హుశానాగల కలెక్టరు పదవి వచ్చింది కనుక నాకు హైద్రాబాద్‌లోనే పెద్దపెద్ద వుద్యోగస్థులంతా షాహుకార్లంతా బ్రహ్మరథంపట్టి పంపించారు. అంచేతనే నేను రావటం ఆలస్యమైంది.

తాయా—అయితే మీ రెప్పుడు మా ప్రజచేత బ్రహ్మరథం పట్టించుకొంటారు.

దేశ—దాని కేం? దాని కెప్పుడు పడితే అప్పుడు మనం తయారు. అన్నీ సంసిద్ధంగానే వున్నాయి.

తాయా—నిజంగా...అన్నీ సంసిద్ధంగానే వున్నాయి.

దేశ—పోదూ! నీ సరసాలూ నీవూ. కొంచెం మంచినీళ్లు తెచ్చిపెట్టు.

తాయా—సరసాలకంటే మంచినీళ్ళెందుచి ?(అని మంచినీళ్ళకోసం వెడుతుంది)

దేశ—ఆడవాళ్ళ కెదుట మగవాళ్లు యెప్పుడూ కనిపెట్టుకొని వుంటుంటే ఇహా, ఆడవాళ్ళకి సరాగాలూ, సరస సల్లాపాలూ చాలనుకొంటూ ? దాంతో వాళ్ళకి అన్నం నీళ్లక్కర్లేదు కూడా. (పూజామందిరం చూచి) చాలా అట్టహాసంగానే వున్నాయే పూజలు పురస్కారాలూను ! ఎట్లాగైతే యేం ? ఆడవాళ్ళు నోచుకొంటున్న నోములవల్లనే మొగనాళ్ళ కార్యకలాపాలూ, వ్యవహార వ్యాపారాలూ జయప్రదంగా సాగుతుంటై.

(తాయారమ్మ వెండిగ్లాసుతో మంచినీళ్లు తీసుకొని ప్రవేశం)

తాయా—(మంచినీళ్ళందిస్తూ) యేమిటో యెగతాళి చేస్తున్నారే? మా ఆడవాళ్ళ పూజలూ పురస్కారాలూ మీకు యెగతాళిగానే వుంటై లెండి.

దేశ—(మంచినీళ్లు త్రాగి) ఐతే, దివాణంలోని నౌకర్లంతా పనిపాట్లల్లోకి వస్తున్నట్లేనా ?

తాయా—ఆ...వాళ్ళెక్కడికి పోతారు ? వాళ్లు మన ప్రాణంతీయందే మట్టుకు వెళ్ళటానికి లేరు.

దేశ—(ఆశ్చర్యంతో)ఏమిటి! అట్లా అంటున్నావ్ ?(సిగరెట్టుముట్టిస్తాడు)

తాయా—అట్లా అనడమేమిటి? వారు ముట్టించిన సిగరెట్టు మాదిరిగానే మనల్ని మన దివాణాల్ని మసిచేయటానికి తయారైనారు.

దేశ—ఎవరా శత్రువు?

తాయా—మీతో బాటు సమమంత్రపు అధికారం మీ దేశానికొచ్చిన మీరాజాసాహేబు గారికొచ్చిబడ్డ పలుకుబడితో మిమ్మల్ని అయిపు లేకుండా చేసి.....

దేశ—ఆ...ఆ...ఆ...ఆ...ఎవర్ని ! అయిపులేకుండా చేయటం ?

తాయా—ఎవర్నేమిటి ? మిమ్మల్నే చెప్పటంలా!

దేశ—మన నిగామాన్ గాడేనా అంత కుట్రకు దిగింది?

తాయా—మన నిగామాన్ గాడేమిటి? ఇప్పుడంటే అన్నారు. ఇక మట్టుకు అనకండి. మీ చేతులారా మీవెంట తీసుకుపోయి మీతో బాటు సమానమైన అధికారం గల వుద్యోగం సంపాదించి యిచ్చినప్పుడు నిగామానుగాడంటే బాగుంటుందా మరి!

దేశ—సరేలేద్దూ యేమిటో ఆ కుట్ర పూర్తిగా చెప్పవైతివేం?

తాయా—క్షమా, మీ కాలస్యంచేసి వుపేక్షిస్తే మట్టుకు మీ ప్రాణాలుండవు—మా ప్రాణాలుండవు.

దేశ—అంత కృతఘ్న కార్యానికి పూనుకున్నాడుగా! తర్వాత ?

తాయా—తర్వాతేముంది! మన ప్రాంత దిక్కూ దివాణం లేకుండా చేయటానికి సిద్ధపడుతున్నాడు.

దేశ—ఏమిటబ్బా! చాలా విపరీత వార్త చెప్పిని వేళ వ్. ఇది నిజమేనా? ఎగతాళి చేస్తున్నావా?

తాయా — ఎగతాళేమిటి? అల్లులికి అధికారాల్ని సంపాదించి పెట్టటం కూడా మీరెగతాళికే సంపాదించి పెట్టారనుకోవాల్నా?

దేశ — నిజమేనా? నిజమైతే చెప్పు ఇప్పుడేవాణ్ణి చీల్చి చెండాడి వస్తా.

తాయా — నిజమేమిటండీ? దీనికి తగ్గట్టుగా శకునాలన్నీ కనుపిస్తున్నై.

దేశ — (పెద్దగా నవ్వి) వెర్రిదాన, శకున శాస్త్రుల మాటలు వినా! ఇంత ఆందోళన పడుతున్నావ్.

తాయా — ఐతే మీ కేమీ ఫర్వాలేదన్న మాట! శకునాలేమీ మిమ్మల్ని యేం చేయ లేవన్నమాట! అట్లాగే కానివ్వండి. అవస్థ లొచ్చిపడితేగాని ఆదుర్దా పడరులెండి.

(గొల్ల సుబ్బడు ఉత్తరం, కాకితాల కట్ట తీసుకొని ఆదుర్దాగా ప్రవేశం)

సుబ్బడు — అమ్మగోరూ! అమ్మగోరూ! ఇదుగో దొరగోరి దివాణంలో కాయితాల కట్టలేనాండి. మా దొరగోరింకా రాలేదేటండి?

దేశ — ఏమిట్రా అంత హడావుడి. నా దేం హడావుడి. నే నిక్కడున్నదే కనపడ్డంలేదా?

సుబ్బడు — (ఉలిక్కిపడి తెల్లబోయి దణ్ణం పెడుతూ నెత్తిగుడ్డ లాగుతూ) బాబో! సత్తెప్రమాణంగా నాకానరాలేదండి బాబో!

దేశ — సరేలే! ఏమిట్రా అంత ఆదుర్దా పడుతున్నావ్?

సుబ్బడు — ఇంకేటున్నదండీ మాబాబో! నిగా పాన్ సాయబయ్యగోరికి పట్టపగ్గాల్లేకుండా పోయినై. దయచేసి త్వరగా ఉత్తరం యీ కాయితాలకట్ట స్వయంగా స్వీకరించండి బాబో!

(ఇడిగావున్న కవరు, కాకితాలకట్ట తీసి యిచ్చును)

(దేశముఖ్ కవరు చించుకొని. ఉత్తరం తీసుకొని చదువుతుంటాడు. ఆదుర్దాగా తాయారమ్మ ఉత్తరంవంక ఎగబడి చూస్తూవుంటుంది. గొల్ల సుబ్బడు ఊడిపోయిన తలగుడ్డ చుట్టుకొంటూ వుంటాడు.

చెవిలోంచి జారిపోయి (క్రిందబడ్డ 'గలాల ఆకుచుట్ట తీసుకొని కాస్త
దూరంగా నిలబడి వుంటాడు.)

తాయా— యేమిటండీ ఆవు స్వరం ఎక్కణ్ణించొచ్చింది.? ఒకచో ఎగా
దిగా చూస్తుంటాడు. సుబ్బుడుగు కాస్త నాగ్గూడా.

దేశ— సెబాసా, నిజంగా నీవంటి పతివ్రత సాధ్వి చెప్పిన మాటల్ని విని
వించు కోకుండా వుండటం కూడా మహా ప్రమాదానికి దారి
తీస్తుంది నీచాతినీచుడు, ప్రాణుడు గతిలేని కటిక దరిద్రుడు.
ఇంకోపకారాన్ని మరచిపోకుండా యెట్లా వుంటాడు? ఎంత
మహానీక కృతఘ్నునికైనా సాహసించి దిగకుండా ఎట్లావుం
టాడు! నిజం—నీవు చెప్పింది సుమ్మాత్మశికి నిజం ఓరి గొల్ల
వాళ్ళా!

సుబ్బడు—(ఉలిక్కిపడి, చేతిలో క్రొబాకు క్రిందపడి వణుకుతూ)
బాబూ! యేందండి సెలవిస్తున్నారు!

దేశ— ఏఁ! కాగితాలకట్ట యెక్కడేసిదిరా?

సుబ్బడు— సత్యప్రమాణంగా సెప్తుండానాడు! ఇయాల నేను సేలోకి
పోతుంటే నాకు మీరాసాహేబుగోరి దగ్గిరున్న పోలీసయ్య
గోరు యెదురైరి కాసిని నా తాటేటికాయలో మంచినీళ్ళి
య్యమని అడిగాడయ్యా. ఆపాళ నా తాటేటికాయలో
మంచినీళ్ళు అయ్యోరుసయ్యాకి పోసినాను కాసేపు పోలీసయ్య
సేలో సెట్టుకాడ కూకొని లేసిపోతూ యేదో కాగితాలకట్ట
యిడిసి పోయాడయ్యా. అల్లది నేనుకూడా సూసుకోకుండా
నా త్రాళ్ళి మళ్ళేయటానికి పోయానయ్యా! పోలీసయ్య సాలా
దూరంగా నడసి పోయాడు మళ్లి నేను పోలీసయ్యకూకుండా
సెట్టుకాడ కొస్తునుగండా ఆడ యీ కాగితాలకట్ట కనిపించి
నయ్యయ్యా. మర్సిపోయాడు గామోలు. దివాణంగోరు
కాగితాల కట్టని నేను భద్రం సేసుకొని మీకడకు తెచ్చు
కొండానయ్యా.

తాయా—ఇప్పటికైనా నమ్మేరా నామాట?

దేశ—మీమ్మాటకే నమ్మాను. అయితే యీ కవరు విడిగా వుందేమిరా సుబ్బా?

సుబ్బడు—నేను దివాణం కాడకి తీసుకొస్తుంటేసరికి యీ కట్టలోంచి జారిపోయింది బాబో.

తాయా—మిగతా కాగితాలన్నీ యేమిటో తనిఖీ చేయద్దూ?

దేశ—చెయ్యొచ్చులే. ముఖ్యమైందే బయట పడింది.

తాయా—అసలు యేమిటో చెప్పక పోతివే!

దేశ—ఏముంది? నీవింతకుముందు చెప్పిందంతా వాస్తవమైంది. ఈ నిగామానుగాడు చుట్టుపట్ల వూళ్ళల్లో కొంతమంది ఇత్తేహాదుల్ ముస్లిమీన్ కుట్రదార్లని కల్పుకొని, అమాంతం మన దేవిడీమీదపడి, మనల్ని హత్యచేసి, హిందూ పురుగును రాజ్యాధికారంలో లేకుండా జేసి, దురాశా పీడితుడై రాజ్యం కూడా యేద్దామని చూస్తున్నాడు. ఇదంతా ఇత్తేహాదుల్ ముస్లిమీన్ అధ్యక్షుడైన రజ్వీ సలహా చొప్పున మతం నిషాతో చేస్తున్న కుట్రగా కనిపిస్తున్నది. ఇక్కడ హిందూ ముస్లిం తేడా చూపించి ముస్లిం సమాజాన్ని ఈ రాజ్యంలో ఎక్కువగా దించి రెండు రెట్లు మెజార్టీగా చేసి, నిజాం రాజ్యాన్ని ఇండియన్ యూనియన్‌లో కలవకుండా చేసి, నేటి నిజాం రాజ్యాన్ని సర్వస్వతంత్ర రాజ్యంగా ప్రకటించుకొందా మని ప్రయత్నిస్తున్న పెద్దకుట్ర బయల్దేరతీశారు. ఏదియెట్లైనా ఎవరు రాజ్యానికి ప్రభువైనా నేను సమ్మతిస్తానుగాని, ఇహ నాబొందిలో ప్రాణం వుండేవరకు యిటువంటి నీచాతినీచులైన నిగామాన్ మీరావంటి దుష్టకీచకుల్ని తెగటార్చుందే మటుకు కన్నుమూయను—మూయకూడదు.

(చంటిపిల్లవాణ్ణి తీసుకుని మీరాసాహెబ్, పట్వారీ పంతులు ప్రవేశం)

మీరా & పంతులు—సలాం రాజాసాబ్.

(తాయారమ్మ మీరాను, పంతుల్ని చూచి సత్కరించును. దేశముఖ్ సిగరెట్టు వెలిగించుకొంటాడు. మీరా కూడా సిగరెట్టు వెలిగించు కొంటాడు)

మీరా—హైద్రాబాద్ మె క్యా సమాచార్ రాజాసాబ్ ?

దేశ...బాత్ కర్ నఖో

మీరా—(దిగ్భ్రమతో) కౌన్ రాజాసాబ్ :

(పంతులు దిగ్భ్రమపడి తెల్లబోయి చూస్తుంటాడు)

దేశ—చుప్ రహో బద్మాష్.

మీరా—టహరో మహారాజ్ టహిరో ! హేమ్టి జబర్దస్తీ సేస్తుండార్ మీరు ?

(గొల్లసుబ్బడు పిల్లాడ్ని గట్టిగా పెద్దగా కేకలు పెట్టుకొంటూ విని గడ గడ వణకుతూ బిక్కమొహం పెట్టుకొని నలుదిక్కులా చూస్తుంటాడు.)

దేశ—ఇహ కట్టిపెట్టు. ముందొచ్చిన చెవులకంటె వెనకొచ్చిన కొమ్ములు. వాడిగా తేలినై. అట్టె వదరక.

మీరా—రాజాసాబ్ ! మీకీనత్తెం నూనుకోకుండా బడా గడబిడ్ సేసికో హూంద్. (అనిచేతిలో ఉన్న పిల్లవాణ్ణి పంతులు చేతి కిస్తాడు)

దేశ— విశ్వాస ఘాతకుడా ! నిన్ను చిన్నప్పట్నుంచి పెంచి పెద్దవాణ్ణి చేసిన మాట మరచిపోయి ఎంత కృతఘ్నతా న్యాసికి సాహసించిలివిరా !

మీరా—అధీ సాలా బురా బాత్ రాజాసాబ్. నాకి హేమ్టి తెలియద్. మీ గోడ్వా సూస్తుంటే నాకీ బహూత్ ఘాబరా హోత్తుం జాద్. మై కుచ్ ఖాయుం నహీ.

దేశ—ఐతే నువ్వెరిక్కపోతే యెరక్కపోయావు గాని, ఇవాళ హైద్రా
బాదునుంచి జరూర్‌గా ఒకవార్త వచ్చింది. కాని దాని
ప్రకారం నీవు వెంటనే నీ పోలీసు రిజర్వు సిబ్బందితో సహా
వూళ్ళమీదకు వెళ్ళి యీ పంతులు చేతిలో పిల్లవాడి
సహాదిరి మననైజాం వూళ్ళలో పెరుగుతున్న చందీ పిల్ల
వాళ్ళ సంపర్కి యెక్కువెక్కువున్నాయో యెరి నరికి పారే
యాలి. అక్టం వచ్చిన వాళ్ళ నల్లా తుపాకులతో కాల్చి
పారేసి రావాలి. అప్పుడు నిన్ను నమ్ముతా.

మీరా—(తెల్లబోయి) హారె హాల్లా! హెట్ల వొచ్చిందిరా గ్రహ
చారం.

దేశ—అరే గొల్లసుబ్బా!

సుబ్బడు—(ఉలిక్కిపడి) బాబో! సత్తెపమాణంగా నేను నాకేల్లలం
యేమీ యెరగం బాబో!

దేశ—ఏమిట్రా పాడుగోలా నివ్వాను.

మీరా—రాజాసాబ్! నాకీ హలుద్యోగం హూడిపోయినా నాకి సం
తోషం హుంటుంది ఖాని, నాకీమాత్రం ఖూకీ సెప్పినటకా
హూళ్ళల్లో పిల్లల్ని సంపాలేన్.

దేశ—నావంటి పెద్దవాళ్ళని చంపుతావా?

మీరా—హది నాకీ తెలియదు. మై మాలుం నై

దేశ—ఐతే ఇంతకుముందు నిన్నుగురించి దొరికిన యీ కాగితాల
ద్వారా తేలిన వ్యవహారాన్ని బట్టి నీవు ప్రజల దగ్గర
లంచాలు పుచ్చుకొని పన్ను లెగేస్తున్న ప్రజల్ని వదలి
వేస్తున్నట్లు పైన సర్కారు వారికి తెలియచేయ
మంటావా?

మీరా—పైనా అల్లాలేదూ హుండి? ఖాసీయుండి. హన్నింటికీ
సిద్ధంగానే హున్నా.

దేశ—(కాగితాలకట్టలోంచి రెండు తెల్లకాగితాలు తీసుకొని) ఈకాగితాలు రెండిటిమీందా నీసంతకాలుపెట్టు, నీకెందుకో రొష్టంతా.

మీరా—అచ్ఛా! నాకీ ఘాట్ లేదూహాండి. కాగజ్ దేవో.

(దేశముఖ్ ఒక కాగితంమీద మీరా వుద్యోగం వదలు కొంటున్నట్లు రాజీనామా పత్రం వ్రాస్తాడు. రెండవ కాగితంమీద వుద్యోగం లేకపోతే లేకపోయిందిగాని నిరంకుశ నిజాం హుకుంతో ఊళ్ళల్లో పసిపిల్లల్ని పట్టుకొని చిత్రవధలు చేయటం మట్టుకు నాకేమాత్రం ఇష్టం లేదని, యిహానుంచి యిటువంటి దారుణ చర్యలు యేమాత్రం జరపటానికీగూడా నాకు త్రికరణశుద్ధిగా మనస్కరించటం లేదని దరఖాస్తు వ్రాస్తాడు. రెండు కాగితాల్ని చదివి వినిపిస్తాడు,)

దేశ—విన్నావుకదా. బాగా ఆలోచించుకొని మట్టుకు సంతకాలు పెట్టు.

మీరా—హింకా దేక్నా; హాలోచన్కైకూ రాజాసాబ్. దేవో కాగజ్ (అని కాగితాలు తీసుకొని సంతకాలుచేసి రెండు కాగితాలు దేశముఖు కిస్తాడు.)

దేశ—(కాగితాలు తీసుకొని అక్కడున్న మిగతా కాగితాల కట్టల్ని కూడా తీసుకొని) ఇంట్లోకి వెళ్ళొస్తాను. వెళ్లవచ్చు కాస్తుండండి (అని వెడతాడు.)

సుబ్బన్న—ఏంబాబు సాయబయ్యగోరు! ఎందుకు బాబో నాకు తెలియకడుగుతా. దొరగోరు, మీాకు కోపగించుకొండాపు?

మీరా—హారే నీకే హాస్నీ హింటున్నావ్ కదూబే,

సుబ్బన్న—(ఉలిక్కిపడి) ఔను బాబో! మీారు సెప్పుకొంటుండవేమో నాకేమీా బోధపడక అడుగుతుండా.

మీరా—హాదీ ఖాదూ జే! మన్షీ జల్మ హెత్తినాహోడ్కి గుండెఖాయ హుండో ద్దుజే.

సుబ్బడు—ఉండాల బాబో! హృదయం లేకపోతే బాబో—అన్నీ వుపద్రాలే యిర్సుకు పొయ్యేధండీ? బాబో, సత్తెం సెప్పారు.

మీరా—హాదిఖాదురా, పసిపిల్లల్కి సూస్తూసూస్తూ సంపటాన్కి సెయ్యి హెవడ్కి హోత్తుందిరా? యీ నాఖర్కి లేఖా పోతే లేఖాపోయేగాని నాజల్మంలో నాకీ హంత పాపిట్టి పన్కి నై జానా. భత్కిహుంటే సల్లగా హాల్లా కటాచ్చం హోల్లా బల్లాన్కి ధిని భత్యాహూంచ్. ఖూ! కైకూనే పాపిట్టి జల్మా!

పంతులు—మీకొక్కడికే లేదు అల్లా—కావలసిన కటాక్షాలన్నీ గంప కెత్తుకొని.

సుబ్బడు—యీకరణపోరి మాటకేంగాని నీవు మా మారాజు గదయ్యా సాయబయ్యా! గొప్పవాక్కాలు సెలవిచ్చుండావ్.

(దేశముఖ్ ప్రవేశం)

దేశ—ఐతే మీరా, ఇహనీవు వెళ్లిరావచ్చు. ఇక నీకు నేను చెప్పే దేమీలేదు—నీవు నాకు చెప్పే దేమీ లేదు. నీకు రావలసిన జీతం యేమైనావుంటే లెక్కలు చూచుకొని నీకు కబురు చేసి యిస్తాం. ఇహ వెళ్ళ వచ్చు.

మీరా—అచ్ఛా, సలాం మహరాజ్ (సలాంచేసి. నిష్క్రమిస్తాడు.

దేశ—అరే సుబ్బా!

సుబ్బడు—(ఉలిక్కిపడి) అయ్యా! అయ్యా! దొరగోరు!

దేశ—ఇక్కడ మేము చెప్పుకొన్న మాటలేవీ రెండోవాళ్ళ చెవిని పడగూడదు.

పంతులు—పడ్డయ్యా-ఇహా నీకూ నీ పిల్లలకూ మూడిందన్నమాటే! వెళ్ళు—పో!

సుబ్బడు—సిత్తం మావ్వెబో. (వెనక్కి వెనక్కిపోయి చెప్పులు చేత్తో తీసుకొని, కళ్ళతీసుకొని నిష్క్రమిస్తాడు.)

(తాయారమ్మ ప్రవేశం)

తాయా—ఇంతకూ మీరు పగసాధించుకొన్నదేముంది?

పంతులు—ఇంతకుముందు యీ పొగరుబోతులకు జరిగిన శా తమరు చూచికూడా అడుగుతారేమిటి?

దేశ—యీమధ్య వచ్చిపడ్డ యీ నడమంత్రపు వుద్యోగంతో కళ్ళు నెత్తిమీదకొచ్చి ఒళ్ళు విరుచుకొని తిరుగుతున్న మీరా గాడికి వుద్యోగం కాస్తా వూడిపోయేట్లు చేశా.

పంతులు—ఇహా చిప్ప చేత్తో పట్టుకొని యీ మీరా సాహెబ్ గాడు పకీరు వేషంతో యేయితర రాజ్యంలోనన్నా అడుక్కొని తినాల్సిన గ్రహచారం పట్టించారు.

దేశ—ఇదిగో నామీద వాడు లేవదీసిన పితూరీలు, నేరాలు, బోలెడు సంతకాలతో, సాక్ష్యాలతో కట్టలుకట్టి పంపిస్తున్న వాటిని నీముందు యేంచేస్తున్నానో చూడు. (అని తనమీద పితూరీ చేసిన కాగితాలన్నింటిని సిప్పుపుల్లగీచి తగులబెట్టి చూపిస్తుంటాడు.)

పంతులు—యీ దేశ సేవకి జరిగిన మూలా అంతా యిట్లా దగ్ధమైతేగాని ప్రపంచానికి శాంతిరాదు.

తాయా—ఇహనైనా పాపిష్టివాళ్ళకి దివాణాల్లో చోరవ యివ్వకండి. (దేశముఖ్ కుర్చీలో కూర్చొని కాగితాలు చూచు కొంటూ వుంటాడు.)

పంతులు—వీళ్ళని చేర్చటంకూడానా దివాణాల్లో, ఇదిగో అమ్మా! చేతిలో ఆపాపిష్టి సంతానమే మిగిలివుంది. వీళ్ళ జాతర రేపుగాని కాదు.

తాయా—పాపం! యీముక్కుపచ్చలారని చంటి పాపాయిని మట్టుకు యేం చేయకండి.

పంతులు—వీళ్లు పాపాయిలుగాదండి. ప్రపంచానికి పట్టుకొని యేడి పిస్తున్న పాపాలు. పాపసంహారం చేయకపోతే యెట్లా?

దేశ—నీకేం తెలియదు. నీవీ రాజకీయ విషయాల్లో జోక్యం యేమాత్రం కలిగించుకోక, పంతులుగారు! రేపు రజ్వీగారు మనం జరిపించబోతున్న మహాసభకి అధ్యక్షులుగా వస్తు న్నారు. ఒక చేత్తో ఖడ్గాన్ని, ఒక చేత్తో ఖురాన్ని పట్టు కొని ప్రపంచానికి పవిత్రమైన రాజకీయ సందేశాన్ని యిస్తున్న తరుణంలో మనం మన నవాబుగారి శాసనాన్ని శిరసావహించి యీరాజ్యంలోవున్న యిటువంటి పసికుర్రల్ని కొంతమందిని రేపు బలియిద్దాం. మన నిజాం రాజ్యానికి పట్టినపాపిష్టిపీడను వదలగొట్టుకొందాం. రేపు మిగతాపిల్లల్తో బాటు యీపిల్లవాణ్ణిగూడా కాశీం రజ్వీగారి సమక్షంలోనే చిత్రవధ చేద్దాం. పిల్లవాణ్ణి పట్టుకొని నాతోరండి.

తాయా—(అడ్డంపోయి) మీారు శిశుఘాతకులు కాకండి.

దేశ—ఓసి తెగువితక్కువదానా! వీళ్లు శిశువులుకారు. వీళ్లు మన. మన రాజ్యానికీ శిశుపాలురు. నీకు తెలియదు; అడ్డంరాకకే

తాయా—వాళ్ళు శిశుపాలురైతే మనమంతా శిశుఘాతకులైన కంసులమైనా మన్నమాట.

దేశ—నీకు తెలియదు అడ్డంరాక.

(పట్వారీ పంతులుతో బాటు దేశముఖ్ వడిగా నిష్క్రమింతురు.)

తాయా—హరిహా! యీ ధనదాసులు, యీ పదవీ వ్యామోహ పిశాచ నిశాచరులంతా కలసి యింత దారుణమైన, నిర్దాక్షిణ్యమైన పరమ నీచాతినీచమైన శిశుహత్యాపాతకానికి ఒడిగట్టుకొని దిగుతున్న యీ పాపిష్టి దేవిడీలలో దివాణాలలో పడి పొట్టన్ని నింపుకొని హీనాతి హీనంగా బ్రతకటం కంటే ఎక్కడికన్నా పోయి యే పాడునూతిలో నన్నా పడితే మేలు.

(అని తటాలున నిష్క్రమించును)

(తెరపడును

---

మహారంగం—మహాసభ

(పద్మమ్మ జెండా భుజాన పెట్టుకొని గేయం చెబుతుండగా మహారాజశ్రీ, కోటారెడ్డి, గొల్లసుబ్బడు, మీరా,రామి పాడుతూ ప్రవేశించి గేయం పాడింతర్వాత సభావేదిక నలంకరిస్తారు)

— గేయం —

ప్రేమ కురిపించాలి తండ్రీ
భేషజము విడవాలి తండ్రీ
విశ్వగురుదేవుండు గాంధి
ద్వేషరోషము తీసివేసి
మాయవేషము మానివేసి
గాంధి యడుగుల్లో నడువ వలెనోయ్ ప్రేమ॥

బక్కవారిని పస్తుబెట్టి
గుళ్ళుగోపురాల్ మళ్ళిగట్టి
ముల్లెగలవార్మురిసి పడుచో
గాంధియాత్మకు శాంతిరాదోయ్ ॥ప్రేమ॥

వచ్చి తగిలిన గుండె దెబ్బకు
పచ్చిపుండై ందీ ప్రపంచం
నీ మతానికి మానదోయీ
కోపతాపము రేపకోయీ ॥ప్రేమ॥

హెచ్చుతగ్గుల పిచ్చిబ్రతుకు
ఖచ్చితమ్ముగ కంటగించి
కులము మతములు మరువ వలెనోయ్
కలసి మెలిసి తిరుగ వలెనోయ్ ॥ప్రేమ॥

మహా—అమర మహాత్మాజీకి జోహార్ ! స్వతంత్రభారత్కీజై ! క్యోటా మహాతెలంగాన్! చలో హైద్రాబాద్ ! బోలో మహాతెలంగాన్ జిందాబాద్ !

(అని నినాదాలివ్వగా అందఱూ అంటారు. తర్వాత కోటారెడ్డి వేదికముందుకొచ్చి)

కోటా—మహాజనులారా! నేను మన భారత భాగ్య విధాత యైన అమర మహాత్మా గాంధిజీ స్మారక చిహ్నంగా మహాసభా సమావేశం చేశాం. ఈ మహాజనసభకి నేను మన మహారాజశ్రీ గురుదేవులు సభాధ్యక్ష పదవి నలంకరించవలసిందిగా సభాసదుల తరఫున నేను ప్రార్థిస్తున్నాను. అని పూల హారం మహారాజశ్రీ మెడలో వేస్తాడు.

అంతా కరతాళధ్వనులు చేస్తారు. అసుర మహాత్మా గాంధీజీకి జోహార్లు! మహారాజశ్రీకి జై!' అని సభాసదులంతా అంటారు

నిజాం—(లేచి) హియారాళ మన్కీ మహా వేషం సేసిందాన్కీ మన మహారాజశ్రీ ఘూర్ హృద్యమ్ముల్లా హటుంటాన్కి నాకీ బల్పరుస్తున్నాన్ (అని కూర్చుంటాడు)

(అంతా కరతాళధ్వనులు చేస్తారు.)

మహా (లేచి) విశ్వ మహాజనులారా! మహా తెలంగాన్ తెలుగు సోదర సోదరీమణులారా! నేడు మనమంతా పెద్ద చిక్కు చీకట్లో చిక్కుకుపోయాం. మనకి మార్గం చూపించదగ్గ మహా తేజోవంతుడైన, జగద్బాంధవుడైన మన భారతజనక చక్రవర్తి ఒక మతోన్మాది తుపాకి దెబ్బకు గురియై అస్తమించి మనకు లేకుండా పోయినాడు. మనకి అహింసా వజ్ర సంకల్పంతో అమూల్యమైన మానవ జీవితానికి దగ్గ నవ్య చేతనాలోకాన్ని సృష్టించగల స్వతంత్ర స్వారాజ్య భాగ్యాన్ని ప్రసాదించి పోయినాడు. దాదాపు రెండువందల సంవత్సరాలు నిరంకుశ రాజ శృంఖలాల్ని తగిలించుకొని మనమంతా మన అఖండ భారత దేశాన్ని బంధిఖాన ప్రపంచాన్ని చేసుకొని తెల్లజాతి యేలుబడిలో హీనులమై దీనులమై మురిగిపోతున్న పాపిష్టి దరిద్రకాలమందు మనతో పాటు అవతరించి మనకంటే శత సహస్ర విధాల అష్ట కష్టాలుపడి, తన ప్రసన్న చంద్రికలతో పరిశాంత ప్రసూన హృదయ శయ్యమీద బక్కచిక్కి పోతున్న భారత దేశాన్ని పరుండబెట్టుకొని మధురమంజుల వాగ్విలాపాలతో లాలించి పాలించి యీనిరంకుశ రాజశృంఖలాల్ని త్రెంచి వేసిన మన అఖండ భారత జనకుణ్ణి మనం సంపూర్తిగావిశ్వసించి కనిపెట్టుకొని వుండకపోబట్టే శత సహస్ర యుగాలిగ్గూడా సంపాదించుకోలేని మహాత్ముణ్ణి, మలదేశాన్ని దుర్బుష్ట

వంతులమై, దురాశాపీడితులమై, దురంత ఘోర దుర్మద మతోన్మాదులమై, నానా కుల, మత, జాతి, వర్గ, పార్టీ కిరాతకులమై ప్రళయ మృత్యురాక్షసి వాతను పెట్టుకొన్నాం.

కనుక, మహా తెలంగాన్ విశ్వమహాజనులారా! మన అమర మహాత్మాజీ స్మారక చిహ్నంగా మనం ప్రధానమైన, పవిత్రమైన, హిందూముస్లిం ఐక్యత తెచ్చుకొని, దానిని చిరస్మరణీయంగా కాపాడు కొనేందుగ్గాను మనం ముఖ్యంగా అమర మహాత్మాజీ పేర హింద్-పాకిస్థాన్ విశ్వవిద్యాలయాన్ని ఒకటి మన ఢిల్లీ నగరమందు సంస్థాపించు కోవాలి. దానికోసం మనమంతా యీనిమిషంనుంచి త్రికరణశుద్ధియైన వజ్రసంకల్పంతో బద్ధ కంకణులం కావాలి. ఈ దేశంలో మనం హిందూ ముస్లిం ఐక్యత, సఖ్యత సాధిలచుకొన్ననాడు ప్రపంచంలో పాపిష్టి దరి ద్రాన్ని నిర్మూలించుకో గలుగుతాం. ప్రపంచ మహాజన సమిష్టి కుటుంబ జీవిత సౌఖ్య మార్గాన్ని చూడగలుగుతాం.

తెనుగు తల్లులారా! తెనుగు తండ్రులారా! ఈనాడింకా చాలామంది మాట్లాడ వలసిన అవసరం వుంది కనుక-యిహ, ఆసోద రులకి అవకాశం ఇస్తాను. ముందు గ్రుదమ్మగారు అమరమహాత్మాజీని గురించి పద్యాలు రెండు చదువుతారు. అమ్మా రుద్రమ్మగారూ! దయచేయండి. (అని కూర్చుంటాడు)

(అంతా కరతాళ ధ్వనులు చేస్తారు)

రుద్రమ్మ—. ఈ రవియస్తమించని మహీతల

చక్రము నేలినట్టి దు

ర్వార నిరంకుశ ప్రభుపరాక్రమ

సింహుల నాలుపోగుతో

ధారుణి గట్టివేసి యుగధర్మము

మార్చు మహాత్మునిన్ మహా

భువనమ్ము లవలీల మోయువానిని
మోయుపాదరక్ష లెవరిపైన బడునో!
కూడుగుడ్డ వెలితిజేసి, యాడిపోసి
ఊసిపోసి బహిష్కార దోషవహ్ని
యందు మాడ్చు పెద్దతలలముందు హారతి
ను లెచట తలదాచుకొని యుందురో జగాన!

(అంతా కరతాళ ధ్వనులు చేస్తుండగా కూర్చొనును.)

మహా——(లేచి) కోటారెడ్డిగారు రెండుమాటలు చెబుతారు. నిశ్శబ్దంగా వినాలని ప్రార్థిస్తున్నా.

కోటా——(లేచి) అధ్యక్షా! సోదర సోదరీ మణులారా! ప్రపంచంలో ఆధునిక ప్రభుత్వాలున్నంతవరకూ మతోన్మాదాలుపోవు. మాయలమారి నాటకాలు చెలామణి కాకపోవు. ఇటువంటి దగాకోర్లని, బడాయికోర్లని తర్ఫీదుచేసి ఒలిపిస్తున్న యీ సామ్రాజ్య వాదుల పరిపాల కత్వాన్ని పడగొట్టగల జగా జెట్టి పూర్వయుగ చరిత్రల్లో మచెక్కడా పుట్టలేదు.

ముల్లోకములవారి కల్లోలముల కెల్ల
కొల్లాయిగట్టి ఝోకొట్టెనెవడు?
ముదిరిపోయిన రాచ మతపు పేస్తులనెల్ల
నూలుపోగులు గిటి గ్రాలెనెవడు?
పదునాల్గు భువనాలు పండువెన్నెలకాయు
బోసినోర్ముత్యాలు పోసెనెవడు
నూటయేబది యేండ్లు ఘాటిగా యేటికి
నెదురీదగలనన్న ముదుసలెవడు?

అతల పిఖండ బ్రహ్మాండ నాయకపదయి దిశ
లెక్క: ఒక్క క్వెట్టిండియా కిపున్కతన్ని
గుండె పగిలించి యింత యింగ్లండు దొరకు
గోలు చేసిన విశ్వ గోపాలమూర్తి.

ఇటువంటి అద్వితీయమైన అహింసా వ్రత ప్రతిజ్ఞా పరమేశ్వరు ప్రైన అవతారపురుషునికి మనం సమకాలికులమై యుండికూడా కనుకోలేకపోయాము. మాహాత్మ్యాన్ని పాపిష్టి మతోన్మాదుల పొట్టపెట్టుకొన్నాం (అని కూర్చుంటాడు)

మహే—(లేచి) ఇంకా కాస్త గొల్లసుబ్బడు, మీరాసాహెబుగార్లు కూడా మాట్లాడాలని మీ అందరి తరఫునా నేను కోరుతున్నాను.

సుబ్బడు—(ముందుకొచ్చి) అయ్యో! గురువుగోరూ! నేనేంది సెప్పేది సామీ! సెట్టు సెడిపోయే కాలానికి కుక్కమూతి పిందెలు పుట్టుకొస్తుండయ్యన్నట్టు మన దేశానికి దిక్కుమాలి నోళ్ళంతా దిగొచ్చి మన పెట్టోరి కూసింత పేరూ నాచనం చేసి పారేసు కొంటుండ్రు. యింకా యెన్ని జల్మాలకైనా మనం గాంధీ జేజ్జిన్ని సూడలేం. అయ్యో, గురువుగోరూ! నేనూ నాఅడవి మీరు సెబుతుంటట్లాగానే సదువుకుంటూ కూస్త యీనలుగురు నడుమూన లేసి మాట్టాట్టం వచ్చింది బాబో! (కూర్చుంటాడు)

(అంతా కరతాళధ్వనులు చేస్తారు.)

మహే—(లేచి) కాస్త మీరాసాహెబుగారుకూడా మాట్లాడితే బాగుంటుంది.

మీరా—(ముందుకొచ్చి) హిందూ ముసల్మాన్ భయ్యో! మేరా బాత్ కుచ్ సునియే. హయ్యా నాకీ తెల్గూ భాగా మాటాట్టం అచ్ఛాగా రాలేదూ హండి. హైతే, యీపాపిట్టి ఖాల

ములో స్త్రైసాకి హుండోళ్లు, కులాల్ మతాల్ హుండోళ్లు ఖల్సి జమ్మాన్కి దేశాన్కి లేకుండా నేసిపారేస్తుండార్. మేరా మహమ్మద్కి ఖాడా మహాత్మాన్కి హేసి పోయిన రాస్తా ధోర్కా లేదూహాంటే మిగాలి గిస్తాంది. పై సాగలోళ్ళు బడా సవుకోండోళ్ళు ఖల్సి మొర్కేక్క, ఖులాల్కీ మతాల్కీ పుట్టించి పేదోళ్కి మహాలత్ పుట్టించి బల్ దోస్కూ తింటుండార్. హీల్కీ హాస్తం ఫరాయింపుదేక్ గాంధీ మహారాజ్కీ మింగేశార్. హిష్కాం హిందూ మస్లిం లంతా హేకం ఖావాలా అని సెప్తూహుండా. దాంతో మన్కీ నైజాం ఫీడా హాళ్లి పోద్ది.

(అని అందరూ కరతాళధ్వనులు చేస్తుండగా కూర్చుంటాడు.)

సుభో.—(లేచి) మహాజనులారా! ఈచిట్టచివర ఉపన్యాసాలిచ్చిన గొల్లసుబ్బడుగారు, మీరాసాహెబుగారు మంచి ఆదేశాలు, ఆశయాలు యిచ్చారు. ఐతే నైజాంతో ఇత్తెహాదుల్ ముస్లిమీన్ వాలంటీర్లు, మిలిటరీవాళ్ళు వాడవాడల్లో జొరబడి, ఆబాలగోపాలాన్ని యిల్లు వాకిళ్ళని సర్వనాశనం చేయటమేగాక, రేపు కాశీం రజ్వీగారు యీవరంగల్ జిల్లాలో శిశుమారణయాగం కూడా చేస్తారని ఇప్పుడే కబురు వచ్చింది. ఈపసిపిల్లల్ని వధించటం మన మీరా సాహెబు గారికి యేమాత్రం మనస్కరించక పోబట్టే మొన్న తన ఉద్యోగానికి రాజీనామా యిచ్చి మనఉద్యమంలో చేరారు. అసలు ఒక మహాప్రళయం పగిలినప్పుడు గాని మనమంతా యేకం కాలేకుండా ఉన్నాం. కేవలం రేపు పసిపిల్లల్ని తనముందు చిత్రవధ చేయించి,చుట్టు పట్ల ప్రజల్ని భయభ్రాంతుల్ని జేసి తమపాదాక్రాంతులుగా చేసుకొంటానికి సభా సమావేశం చేయ బోతున్నారట. దీన్ని మనం సహించకూడదు. ఎట్లాగైనా సరే మనము శాయశక్తుల, మంత్,

జాతి, వర్గ, పార్టీ భేదాలు పోగొట్టుకొని మన కూలి, రైతు పల్లెల్ని కాపాడుకొనితీరాలి. మతోన్మాదులకు మనదేశంలో స్థానం లేకుండా చేసి పారేసుకోవాలి.

(తెరలో తుపాకులు కాల్చబడును. గొల్లసుబ్బడు, రామి, ఉక్కిక్క-పడి యిద్దరూ ఒకచోటకు చేరతారు. మీరాసాహెబ్ కోటారెడ్డి, రుద్రమ్మ, మహారాజశ్రీ గారి దగ్గరకు చేరు తారు. మహాజనంలేచి పెద్ద గలభా లేపి చెల్లాచెదరైపో తారు)

మహా...(లేచి) మహాజనులురా ఘరవాలేదు కూర్చోండి. మనం యీ మాత్రానికే భయపడకూడదు. ఈతుపాకుల తుపానులోనే తూర్పు తెల్లవారుతుంది; భయపడకండి.

(ఇంతలో తెరలోంచి మిలిటరీ వాళ్ళుదగ్గరకొచ్చి తుపాకులు కాల్చగా తుపాకీ గుండుదెబ్బ తగిలి రామి, గొల్లసుబ్బడు పడిపోతారు. జనమంతా పరారైపోతారు. మహారాజశ్రీ రుద్రమ్మ, కోటారెడ్డి, మీరాసాహేబు పడిపోయిన గొల్ల సుబ్బణ్ణి, రామినీచేరి, ఒక్కపెట్టున విలపిస్తుంటారు. ఉప చారాలు చేస్తుంటారు)

కోటా—(చూచి) ప్రాణం పోయిందే! ప్రయోజనంలేదు.

మహా....ప్రయోజనంలేదా! ఎటువంటి ఘోరమైన హత్యకి పాల్పడ వలసి వచ్చిందిరా! పరమేశ్వరా! పడిపోయిన గొల్లసుబ్బడూ రామిదగ్గరకొచ్చి) త్యాగధనులారా! నిరుపేదలారా! ఇంతలో యెంతప్రళయ రాక్షసి మీదంపతులిద్దర్నీ పొట్టపెట్టుకొని పోయెనయ్యా! తెనుగు తండ్రులారా! తెనుగుతల్లులారా! యింకేల యీ పాపిష్టి జీవితాలమీద తీపిపెట్టుకొని, పాపిష్టి బ్రతుకు బ్రతకటం, ధనముందని, పెద్దచమువున్నదని గొప్పలు చెప్పుకొని యీనాడు యింత దుస్థితిలో మునిగిపోయివున్న దేశాన్ని యిటువంటి తుపాకి దెబ్బలకు గురియై పడిపో

తున్న బక్కచిక్కిన పేద వాళ్ళమీద వదలిపెట్టి చెట్టుపట్ల పుట్టల్లో తల దాచుకోటానికి పారిపోతున్నారా? మీకు దయాదాక్షిణ్యాలేదా?

కోటా—సూండాలదండు యిటేవస్తున్నట్లుగావుంది. ముందు సేరిద్దర్ని మనం తీసుకొని యీవీర సేవకుల సమాధి పూజాప్రయాత్నాలకి పోదాం పదండి, ఇంకామనం ఆలస్యం చేయకూడదు. రేపు తప్పకుండా మనమహాతెలంగాణా మహోద్యమాన్ని సందర్శించి రజ్వీ రేపు జరిపింపబోతున్న శిశుమారణ మహాయాగాన్ని ముట్టడించవల్సినపని చాలావుంది. మహారాజశ్రీగారూ! వెడదాం పదండి.

మహా—తప్పక రేపు మన మహాతెలంగానా వీర సేవాదళాల్ని నలుమూలల్నుంచీ రప్పించి రజ్వీని ఎదుర్కొని తీరాలి, పదండి.

మీరా—హింకా హెదుర్కోటం హేంవ్వీ? హాడ్కి హైదీగావుంచ్చా మాపెయ్యాలి ఖుదా. జల్దీ చలో బాబా.

(అంతా పడిపోయిన గొల్లసుబ్బన్నీ, రాముని మోస్తుకొని గేయం పాడుకొంటూ పోతారు)

దగాబట్టి పేదలార—జెగాబట్టి వీరులార!
పగిలిపోని ప్రతిజ్ఞతో—రగులుకొన్న బడబాగ్నితో
విప్లవవిలయం లేపండీ-విషాదఘట్టం దాటండీ॥దగా॥

(అంతా నిష్క్రమిస్తారు. తెరపడును.)

# చలో హైద్రాబాద్

## పంచమాంకం

ఒకటోరంగం—(రామి గొల్లసుబ్బడు సమాధి)

(సోషలిస్టు, గ్రామసిమ్మ, మహారాజశ్రీ, మీరానాహెబ్, సమాధికి రెండుప్రక్కల నిలబడి వీరసంస్తుతి చేస్తారు)

— కీర్తన —

సత్యాగ్రహ యోధుల్లారా!
చల్లారని సమిధల్లారా! ॥సత్యా॥
మీపవిత్ర త్యాగమ్ముందే
ఈ స్వరాజ్య యాగం పండోయ్ ॥సత్యా॥
ఈ యాగం ఫలితంలోనా
మీభాగం సొంతం మసియేనా ॥సత్యా॥
ఈ దేవేంద్ర వైభవంలోనా
మీదిక్కింక కనటం కూడానా ॥సత్యా॥

మీరా—ఈ దిల్ మే హిటువంటి బడా హీరుల్కి, సేవమూలంగా, ముందొచ్చు యుగపోళ్ళక్కి బహుత్ సుఖం హాల్కి దిల్ ఖుషీగా ఖాలం ఘుడుప్కొంటార్.

సోష—నిజంగా మీరా చెప్పినట్లు ఈ మహా విప్లవ వీరుల ప్రాణ త్యాగాల వల్లనే భావికాల భాగ్యోదయ సౌఖ్యం ముందు యుగాలవారికి సులువుగా సంప్రాప్తిస్తుంది.

రుద్ర...ఒకరి త్యాగంవల్ల యింకోకరికి మహాభోగం వచ్చిపడటం యీనా
బూర్జ్వా ప్రపంచానికి సహజమై పోయింది.

మ॥ పిలియాల్బిన్ బడినట్టి దేశమునకై బిక్కాపకీర్లయిన వా
రల కష్టంబున పెక్కు దృష్టములతో రాజ్యాధికారష్టు డు
ష్టుల కీనాడొడిలోపడెన్ తెనుగుతంత్రుల్ నేడు సౌఖ్యంబుగా
నిలపైనన్,తలదాచ వీలగునె స్వామీ! ఈదుమారాలలోన్ ॥

కోటా—వాస్తవంగా యీ అక్రమాచారం మన తెనుగుదేశంలో చాలా
ప్రబలంగావుంది. దేశస్వాతంత్ర్యంకోసం తమసర్వస్వంధారబోసి
యీనాడు దిక్కుదివాణం లేక చెట్టూనీడాలేకఎంతోమంది
నిష్కల్మష దేశసేవాధురీణులు పస్తులు పడుకొని మాసిగడ్డ
లై పోతున్నారు.

ఉ॥ నేడొకమంత్రియైన నవనీత మనంబున కగ్గిపోయి యీ
గోడునువిన్న పాపమునకున్ కనిపించక పోయిరేమిటో
తాడునుబట్టి బొంగరము ధారుణి తిర్గునటంచు నేటి మ
న్త్రులు నూహచేసి కపటించిన దేశము గొడ్డుపోవునా॥

మహా— నిజంగా నాలుగు తడపలతో పేనిన త్రాడుతో బొంగరము
తిరుగుతున్నట్లుగానే, యీలోకంలో నలుగురు నిష్కల్మష
దేశసేవా పరాయణుల్తో వున్న సంఘం, వెనక మద్దతు
ఇస్తుండడంచేత, గొప్ప గొప్ప నాయకులై, అధికారులై
కన్నూ మిన్నూ కానకుండా తిరుగుతున్నారు. పాపం మొద
ట్నుంచీ మన తెలంగాణంలో యీ అమాయకపు బక్క
చిక్కిన జీవితాల్తో నలిగినై బలిగినై యిట్లా సమాధియైన
యీ రామిరా గొల్లసుబ్బన్నవంటి వాళ్ళపుణ్యాన మనమంతా
యిటువంటి నాయకత్వాల కెక్కి పరిభూత్వాలు నంపా

దించుకోబోతున్నాం. ఇహ యీ బక్కచిక్కి దిక్కు మొక్కు లేకుండ పోయిన వాళ్ళ సంసారాల మొహం, జాలిపడి చూచు దయాదాక్షిణ్యం గల మహాత్ములున్నారో, లేరో! యీ సువిశాల భారతవర్షంలో యిట్లా బక్కచిక్కిన పేదవాళ్ళ ప్రాణత్యాగాలవల్లనే భావి కాల భాగ్యోదయం మనకి ప్రసన్నం అవుతున్నది. యీ రామీ, గొల్ల సుబ్బాసు మన దేశానికి చేసిన మహాత్యాగానికి మనం ఎట్లా ఋణం తీర్చుకోగలం, ఘన కృతజ్ఞతాంజలి చూపగలం? అసలు కలవాడు దేశానికి చేసిన సేవకంటే కాయకష్టంతో బ్రతుకుతున్న బక్కచిక్కిన పేదవాని దేశసేవే ముఖ్యంగా చెప్పుకోతగ్గది. ఈ విషయాన్ని నాయకులంతా మఱచిపోకుండా క్రియాశూరత్వంలో చూపించినప్పుడు ఏనాటికైనా మన దేశం శాంతిసౌఖ్య మార్గాన్ని పట్టకపోదు.

(శివరావు, రామారావు, కేశవరావు ఆదుర్దాగా ప్రవేశింతురు)

శివ—అయ్యా! మహారాజశ్రీగారూ! నిజాం రజాకార్ల గూండాలు తుపాకులు కాల్చుకొంటూ యిటే వస్తున్నారు.

మహా—రానీయండి, తుపాకులు కాల్చటం వాళ్ళ కలవాటైంది. తుపాకుల తుపానును ఎదుర్కోటం మన కలవాటైంది.

కోటా— మళ్ళీ ఏం వచ్చిపడ్డది ప్రళయం.

రామా—ప్రళయ మేమిటి! మారణ యంత్రాల్తో మానవ మారణ హోమం చేసి నిజాం ప్రభుత్వాన్ని స్వతంత్ర డొమినియనుగా నిలబెట్టుకోవాలని చూస్తున్నారు.

రుద్ర—ఈ మహా తెలంగాన్ ముక్కోటి తెనుగు దేవతల గొంతులో ఊపిరుండగా మన విశాల భారత దేశం మధ్య, వాళ్లువ్విళ్లూరుతున్న, స్వతంత్ర ప్రభుత్వాన్ని సంస్థాపించుకోటం జరగనేరదు.

కేశ— ఈ రజాకార్ల ఇత్తేహాదుల్ ముస్లిమీన్ అధ్యక్షుడైన రజ్వీ మొన్న చేసిన ప్రచండ ప్రతిజ్ఞ తీర్చుకొంటానికే ఇట్లా పసిపట్టి దేశాన్ని తుపాకుల తుపాన్లో ముంచుకొస్తున్నాడు.

మహా— మన మంతా ఇకనైన, కుల, మత, జాతి, వర్గ, పార్టీ భేదాలు లేకుండా ఒకే త్రాడు పట్టి, ఒకే దారి త్రొక్కి, నడవగలిగామంటే యిటువంటి తుపాకి తుపాన్లు ఎన్ని లేచినా మనం నిర్భయంగా ఎదుర్కోగలం, నిగ్గించగలం. ఈనాడిట్లా తుపాకి దెబ్బలకు గురియై, బలియై, సమాధియై వీరస్వర్గం అలంకరించిన ఈ రాము గొల్ల సుబ్బల్లి అహింసామార్గ సారథ్యంతో శాంతి సౌఖ్యమార్గాల్ని పట్టుకోగలం.

మీరా— మహారాజ్ సాబ్ ! దేఖో, దేఖో, రజాకార్ల గూండాల్లి ఆయా హై.

మహా— ఫరవాలేదు. అన్నింటికి పరాత్పరు డున్నాడు. (అని "సత్యాగ్రహ యోధుల్లారా–చల్లారని సమిధల్లారా" అన్న గేయం తాను చెబుతుంటే మిగతావాళ్ళంతా అంటుంటారు.)

(ఇంతకు ముందు- రజాకార్లు వస్తున్నవార్త చెప్పటానికొచ్చిన శివరావు, రామారావు, కేశవరావు పాత్రల్ని ప్రత్యేకంగా రంగంమీదికి రప్పించ నవసరము లేకుండా తెరచాటునున్న ప్రాంటర్ల చేత పై ముగ్గురు చెబుతున్న మాటల్ని చెప్పించవచ్చు.)

(తరుముకుంటూవచ్చి రజాకార్ల గూండాలు ఈ సమాధి దగ్గరున్న వాళ్ళపైన తుపాకులు కాల్చగా ఆంధ్ర మహాసభ నాయకుడైన కేశవరావు తుపాకిదెబ్బ తగిలి పడిపోతాడు. మిగతా వాళ్ళంతా- వచ్చిపడ్డ తుపాకి దెబ్బలు తప్పించుకొంటానికి- మహారాజశ్రీ చేసిన సంజ్ఞతో అంతా బోర్లపడి పడుకుంటారు. రజాకార్లు వీరాలాపాల్తో తెరవెనకనుంచి పోతారు.)

మహా—(లేచి) సోదర సోదరీమణులారా! నేటి ప్రళయం మన ఆంధ్ర సభానాయకుణ్ణి పొట్టపెట్టుకొనిపోయింది. ఇహా మనం వెనకటి పరస్పర అసహాయభావాలు అపోహలు మనమంతా పోగొట్టుకొని ఐక్యపంథా త్రొక్కి నేడు ఉదయం మన ప్రాంతానికి వచ్చిపడుతున్న శిశుఘాతకుడైన, ధేశఘాతకుడైన రజ్వీని మనం ప్రాణాలు తెగించి బంధించాలిసిన పెద్ద కష్టం వస్తున్నది. ఇహా మనం ఏమాత్రం ఆలసించకూడదని పదండి.

శివ—అయ్యా! మహారాజశ్రీ గారు! మీరు చెప్పినట్లు ఇహా మా కమ్యూనిస్టు పార్టీవారిమే మేము కాంగ్రెస్ ఆజ్ఞకి బద్ధులమై మీ అనుయాయుల్లో ఈ నిమిషం నుంచి నడుస్తాం.

మహా—నాయనా! ఈనాటికి దేశం ధన్యత గాంచింది. జై హింద్! మహా తెలంగాన్! జై అమర మహాత్మా గాంధీజీకీ. (మిగతా వాళ్ళంతా యీ చెప్పిన నినాదాల్ని అంటారు.)

రామా—అయ్యా! నా స్టేట్ కాంగ్రెస్ పార్టీవారితో సహా మేము కూడ మిగతా కమ్యూనిస్టు, సోషలిస్టు, రాడికల్ పార్టీలు మీదద పరస్పర ద్వేషభావాలు పెట్టుకోకుండా అఖిల భారత కాంగ్రెస్ వారి ఆజ్ఞ శిరసావహించి మేము కూడా నడుస్తాం.

ప్రద—(ముందుకొచ్చి) నేటికి మన భరతమాత నోములపంట పండింది. జై స్వతంత్ర భారతీ- జై, జై హింద్ మహా తెలంగాన్.

—♦ కీర్తన ♦—

చల్లారని శౌర్యం మాదీ
ముల్లోకం ఉడికించేదీ
ఇంటికి పట్టిన దయ్యాన్నింకా
గెంటేటందుకు పుట్టామో ॥పల్లా॥

మీ మాదిరి నరులం కామా
మీ హాయికి మరలం మేమా
మహాప్రళయాలు పగిలిందాకా
సహాయపడటం కల్లోమాటా
చల్లారని శౌర్యం మాదీ
ముల్లోకం ఉడికించేదీ!

(అన్న కీర్తన రుద్రమ్మ చెబుతున్నప్పుడు అందరు అంటూ • తుపాకి దెబ్బ తిని పడియున్న కేశవరావుని, రామి సుబ్బుళ్ళ సమాధి ప్రక్కన చేర్చి సమాధిచేసి గేయం పూర్తిగా పాడి సమాధులకు నమస్కరించి, పూల హారాల్ని సమాధులపైన ఉంచి జై హింద్ మహా తెలంగాన్, చలో హైద్రాబాద్ అంటూ నిష్క్రమిస్తారు.)

(తెర బడును)

## 2వ రంగము—నిజాం కోటలో నవాబ్ ప్రైవేట్ రూమ్

(చక్కచక్కని నవరత్నాల్తో, ముత్యాల్తో అలంకరించిఉన్న పట్టు సింహాసనంమీద నవాబ్ ఆసీనుడై హుక్కా త్రాగుతూ, పేపరు చూస్తుంటాడు. ప్రక్క చిన్ని కంచిమేక రొట్టె తింటూవుంటుంది. తాను ప్రేమతో పెంచుకొనుచున్న మేకవంక చూచి)

నవాబ్—(లేచి) మేరీ ఛోటీ బకిరీ! నీకీ సబ్ పాన్కి ఖానాసేసీ బడా ఖుషీ జల్సాం నడిపిత్తుండావ్. ఖావో, ఖావో, మేరీ ఛోటీ బకిరీ నీకీ హుండా బుద్ధీ యే లోఖమ్మే జేస్కి లేద్.

(ఠీవిగా రజ్వీ ప్రవేశించి)

రజ్వీ—(టోపీ తీసి వంగి సలాం చేస్తూ) సలాం లేఖుం నవాబ్ సాబ్.
నవాబ్—(నవ్వుతూ) దేఖో దేఖో మేరీ ఛోటా ఖుష్కి బకిరీ.

రజ్వీ—(నవ్వుతూ మేక దగ్గర కొచ్చి) అచ్ఛీ హై నవాబ్ సాబ్ (మేకను ముద్దుపెట్టుకొంటాడు.)

నవాబ్—ఖైర్ సేం క్యా సమాచార్ హై?

రజ్వీ—బహుత్ హై. కాంగ్రేస్కీ మినిష్టర్ బహుత్ బురా వాలా హై. మీకీ నిజాం స్టేట్‌కీ లాగేసి ఇండియన్ యూనియస్‌కీ కింద హుంఛావాలా హని సాలా, సాలా, సైన్యాల్కీ పరిహద్దుల్కీ తెత్తుంటార్.

నవాబ్—హారే సమజ్ హారాం. అంఘాల్గాడ్కీ ఒట్సీసోచ్చారే హన్నమాట. సిన్నాకీ బాత్ సచ్ హై. ఇండియన్ యూనియన్‌కీ మినిష్టర్లకీ హంతా సమ్మజ్ హారాము హైనాక్. ఇసా హిళ్ళతో హన్కీ రాయభారాల్కీ రాజీ కోరాల్కీ ఖట్కీపారేయాలా. మన్కీ రాజ్యంమే రజాకార్ల సైన్యాం జమాగ్గా జాస్తీసేయండి.

రజ్వీ—జీ హాం, మన్కీ. మెద్రాస్ సర్కార్ జిల్లాల్కీ, దత్తమండలాల్కీ రాబట్టుకోవాలా హనీ సైన్యం సిద్ధంసేస్తూ హుంటున్నాం. (సిగిరెట్టు వెలిగించి) సిన్నా బొంబాయ్‌మే నెహ్రూ ప్రయిమ్మినిష్టర్కీ మన్కీమీాదా సాలా, సాలా ఫేలి పోయినాడ్. హింకా మన్కీ సహించాతాద్. మన్కీ ఫరవాలేద్. ఖైనా మన్కీ అల్లా కటాక్షం జాస్తీ హుంది. బ్రిటన్, అమెరికా బడా దేశాలన్నీ మన మద్దత్కీ సేసేట్టూ సేసీహూంచ్చా. మన్కీ ఫోర్చ్‌గల్‌వాళ్లూ గోవా హార్బర్ రాసీ హిచ్చేసేట్టు మాట్లాడినాం. మన్కీ ప్రయిమ్ మినిష్టర్ లామెక్ ఆలీ ఘూడా ఇండియన్ యూనియన్ హంటే మండిపడ్తుండాడ్. మన్కీ రాజ్యంమే హన్నీ పార్టీ వాళ్కీపైనా నిషేధాలన్నింటీకీ రద్దూచేసీపారేసీ మన్కీ పచ్చం హుండేట్టు మంచీ చేస్తుంటూహుండాం. హింకా దేన్నీ ఫరవాలేద్. మేరీ బాత్ సునియె. హింకా ఏక్

మహీనామే నవాబ్‌సాబ్, మీాకీ పాదాల్‌కి బంగాళా సముద్రుడ్కీసేతా ఖడ్గీ ఫూజాసేసేట్టు సేస్తా. జీ నవాబ్ సాబ్ ఆప్‌కా ఫ్కైర్ కరో. కల్ మన్కీ సైన్యాం తీస్కా ఖోయి కొంతా రాజ్యాం పట్టుకొస్తాన్. విమానాల్కీ పేరాషూట్సుకీ, మిషన్ గన్సుకీ, బాంబుల్కీ హాస్నీ సిద్ధం సేసివేశాం. ఆహారాల్కీ ఖావాల్సినా వాటన్నింటీకీ బహుత్ సప్లై సేయించుఖొని హుండాం. హింకా మన్కీ దేన్కీ నై డర్నా. అబ్ బహుత్ కాం ఖర్నా. రజా దేవో, మన్కీ అసఫ్‌జాహీ వంశాన్కీ నిలపెట్టడంఖోసం, నాకీ శిరస్ యిస్తాన్ నవాబ్‌సాబ్.

నవాబ్—సబ్ బాత్ అచ్ఛీ హై, సబ్ తేరే రాజీ. హెప్పటీకీ హాప్డు నాకీ సమాచారమ్ తెల్పుతు హుండావాలా.

రజ్వీ—జీ హాఁ, సలాం లేఖుం (సలాం చేసి నిష్క్రమిస్తాడు)

నవాబ్—(హుక్కా త్రాగుతూ) హైతే మేరా స్టేట్‌కీ హంతా బల్ రగడ్లో ఫడింది హాన్నమాట. అన్నింటీకీ పైనా అల్లా హునాన్నాడ్.

(సలాంచేస్తూ బంట్రోతు లెటర్ తెచ్చి టేబిల్‌మీాద పెట్టి, సలాంచేసి వెనక్కి తిరక్కుండా వెనక వెనకనే అడుగులు వేసుకొంటూ నిష్క్రమిస్తాడు.)

నవాబ్—(కవరు చించి లెటరు తీసి చదువుకొని) హారే! అల్లా, ఈ రజ్వీగాడ్కీ బల్ నమ్మక్‌హారాం అల్లే హుండాడ్. హీడ్కీ మేరా స్టేట్‌మే హిచ్చిన అధిఖారంకీ యొంతా బల్నీ ఖొట్టూఖొంటుండాడ్. నాకీ హిరోధుల్‌గా వుండా కమ్యూనిష్టు పార్టీహోల్కీ హూండలీపెట్టి, యీా రజ్వీ కేవాలా కమ్యూనిష్టుహోల్తో షరీక్ హాయిఫోయి నాకీ మీాద దండెత్తటాన్కీ సూత్తూహుండాడ్. హీడ్కీ [illegible]

హంతా హోషాప్పెసైై నాకీ హిట్లా సేస్తాడా? క్యాకే అల్లా! న్యాయుం, ధర్మం కిధర్ హైరే? జహార్గా హీడ్కీ పట్టి బందీఖానా సేసీ సఫా సేసీ పారేస్తేఘూనీ నాకీ స్టేట్ నాకీ పజల్ సుఖంగా హుండర్. హా, హేమిా గచ్ఛంతరం? నాకీ జహార్గా ఇండియన్ యూనియన్కీ సహాయం ఖోకి సోకీ మచ్చానూపేయాలా.

(దూకుడుగా నిష్క్రమించును)

## 3వ రంగము—కక్షీకోసం వరంగల్ సభాసీమ

(అనేక చిత్రవిచిత్రాల్తో సభామండపం, సభాసీమ అలంకరించివుంటుంది. చినిగిన గుడ్డల్తో కాంగ్రెస్ పతాకాల్తో మహారాజశ్రీ, కోటారెడ్డి, రుద్రమ్మ, శివరావు, రామారావు, మీరాసాహెబ్, మహాజనాన్ని వెంటపెట్టుకొని ప్రవేశిస్తార్. రుద్రమ్మ కీర్తన చెబుతుంటె మిగతా వాళ్ళంతా అంటుంటారు.)

—♦ కీర్తన ♦—

చలో చలో నిజాముకీ
మహా తెలంగ కేసరీ
త్వదీయ ధైర్య శౌర్యముత్
ధూకించరా సహోదరా
ముల్లోకముల్ నుతించగా
కల్లోలముల్ గతి చగా
చలో చలో నిజాముకీ
మహా తెలంగ కేసరీ॥

అమర మహాత్మాజీకి జై, జై హింద్ మహా తెలంగాన్,
చలో హైద్రాబాద్, బోలో మహాతెలంగాన్ జిందాబాద్.

(ఈ నినాదాలు మహారాజశ్రీ చెప్పిన వెంటనే అందఱూ అంటారు.)

మహారాజశ్రీ—మహాజనులారా! ఈనాఁడు జరుగబోతున్న మహాసభలో మన జయాపజయాలు తేలాలి. నిరంకుశ నిజాం ఇత్తెహాదుల్ ముస్లిమీన్ అధ్యక్షుడైన ఖాసిం రజ్వీ తాను గుండాలుగా తయారుచేసిన రజాకార్ల ముఠాతో సహా ఈ సభాసీమకి వస్తున్నాడు. మనమీద లోగడ విధించిన నిషేధాలన్నీ రద్దుచేశాడు. కనుక మనం యీ మహాసభకు రాగలిగాం. అయితే, మనమీదవున్న నిషేధాలు తొలగించటంలో ఏదో కుంభకోణం రాజకీయ యెత్తు వుండితీరాలి. లేకపోతే నిన్నటిదాకా యెన్నెన్నో దారుణ హింసాకాండలు మనమీద సాగించిన రజ్వీ యింతలో యింత అవ్యాజ కరుణారసం కురిపించి, బంధ విముక్తి చేయించి, నిషేధాలు తొలిగించటంలో యేదో పెద్ద యెత్తు లేకపోలేదు. ఇది మనమంతా గ్రహించి జాగ్రత్తగా వుండాలి గాని, సంబరాలు పడకూడదు. మహాజనులారా! ఈ యెత్తుతో మనల్నందఱ్నీ వొక్క చోటికి చేర్పించి యీ నిరంకుశ బకాసురుడైన ఖాసిం రజ్వీ యేదో క్రూర కిరాతకచర్య సాహసించి చేయటానికి తగినట్టుగా ఇంత పెద్ద సభాప్రయత్నం పెట్టుకొన్నాడు. మహాజనులారా అన్నిఁటికి మన అహింసాధర్మ చక్రధారి యైన అమర మహాత్మాజీ శాంతికవచమే మనల్ని కాపాడటానికి వున్నది. భయపడవలసిన పనిలేదు. ఇటువంటి ఇత్తేహాదుల్ వస్తాదులు శతసహస్రకోట్లు వచ్చినా మనల్ని జయించలేరు. ధర్మం మన పక్షాన వుంది. అయితే! యింతకంటే బహు రాజకీయ చాతుర్యంతో మన కొండా రెడ్డి రుద్రమ్మగార్ల సహాయంతో ఎత్తుకు పైయెత్తు కనిపెట్టి, ఆటం బాంబ్ కంటే భయంకరమైన శక్తి

సామర్థ్యాన్ని ప్రకటించే ప్రయోగాన్ని నిజాం కోటను ప్రయోగించి వచ్చాను. ఈ దెబ్బతో కోటమధ్య దాక్కొన్న నిజాం నవాబుకూడా యీనాడు మీ కాళ్ళమీదకు వచ్చి పడతాడు. (అంతా కరతాళ ధ్వనులు చేస్తారు.) సుహృజ్జనులారా! మన నాయకురాలైన సుబ్బమ్మగారి అపరిమిత వీరనారీ ప్రతిభా ప్రభావంతో ఈ ఖాసిం రజ్వీ, యీ రజాకార్లూ ఎక్కడుంటారో, ఏమౌతారో చూడండి.

మహిపయి వీరభారత కు
మారి కళా కవచాలలో మహా
సహనము రక్తవర్షము ప్ర
చండముగా గురిపించి యెన్నియో
గహనము లందు పెద్దవడి
గా దుమికించి నదీప్రవాహముల్
మహిమలు రాశి బోసె మన
మధ్య మహాత్ముని శాంతి పూజతో॥

మనకు బ్రహ్మాండమైన ఇండియన్ యూనియన్ ప్రభుత్వం కాంగ్రెస్ ధర్మచక్ర పతాకం పట్టుకొని మనఅండ నున్నది.

శ్రుతులను గల్పి చక్కని య
శోక పతాకము నీడ వీర భా
రత జనయిత్రి దివ్య నవ
రత్న వినూత్న విశాల హర్మ్య సం
తతి సుఖజీవనమ్ము శప
థమ్ముగ దెచ్చి స్వతంత్ర దేశ మా
రుతమున బోసె మీ జవహ
రుండు హరుండు తిరస్కరించినన్॥

ఖాసిం రజ్వీ కంసుడు మాదిరి తన రజాకార్లతో శిశువధ చేయటానికి వస్తున్నాడు. మీరేమాత్రం క్రోధపరవశులు కాకండి. బహుశాంతంగా వుండండి (అని కూర్చుంటాడు)

(ఖాసిం రజ్వీ ఖురాన్ని ఖడ్గాన్ని ధరించి రజాకార్లతో ప్రవేశిస్తాడు. వెంట దేశముఖ్, పంతులు వుంటారు.)

దేశముఖ్—(వేదిక ముందు కొచ్చి) ఇత్తేహాదుల్ ముస్లిమీన్‌కీ జై, నిజాం సర్కార్కీ జై, ఖాసిం రజ్వీకి జై. (అని పూలహారం రజ్వీ మెడలో వేసి కూర్చుంటాడు.)

(రజ్వీ ఉపన్యాసానికి లేస్తాడు.)

రజ్వీ—అల్లాహో అక్బర్! మేరా నిజాం స్టేట్‌కీ భయ్యో! మీకీచేసిన ఘోరవాస్కీ సాలా సాలా, నాకీ హాసంధం హైంది. మీకీ హంతా ఒకే దేవుణ్ణి, ఒకే ప్రభుఫునీ నమ్మ్కునీ హుంటే మీకీ జీవితాల్కీ సుఖం పడతార్. అల్లాకీ రాజ్కీ ఎఖ్వా బేదంలేదు హానీ మీకీ వేదంలో సెప్పీహుంది. దాన్కీ ఫఖారం మీకీ హుంటే సుఖం పడతార్. ఇండియన్ యూనియన్ స్టేట్‌మే బడా బూరావాలా హై. దాన్కీ నమ్మ్ఖోని హుంటే సెడీపోతార్. ఇండియన్ యూనియన్ మాకీషైన లడాయీ సేయూవాలా హానీ ఒల్ ఖుషీపడుతూ హుండాద్. దాన్కీ మాశక్తి సామర్ద్యా థెల్వాటం లేద్! సునియే స్టేట్‌కీ భంయో! హెంతా పెద్ద పెద్దా కొండల్కీ హైనా సిన్ని సిన్ని నమలావల్లా ఫగిలీ ముక్కల్ ముక్కల్కీ హైపోతవి. హింకా మన్కీ నిజాం స్టేట్‌మే ఇండియన్ యూనియన్ వాసన్కీ థలీ బత్కుతూహుండా లడ్కా లడ్కీల్కీ హుంఛరాద్. హిఫ్ఫడ్తే ధయాకీ సూస్తం మూలంఘూ మన నిజాం స్టేట్‌కీ నిప్పూ పెట్టార్. లాల్ ఖిల్లా కోటమీాద మన్కీ నైజాం జండాకీ ఖట్టి తీరింగా. జీ దేశముఖ్‌సాబ్! కిధర్ హై లడ్కా లడ్కీ?

దేశముఖ్—జీ, హా! ఇధర్ హై. అజే పంతుల్‌సాబ్ పిల్లల్ని తీసుకు రండి.

పంతు—జీ, హా! ఆరహాహూం. (ముందుకు జారుతున్న కళ్ళజోడుతో, రుద్రమ్మ పిల్లవాణ్ణి తీసుకొని ముందుకొచ్చి నిలబడతాడు.)

దేశ—జీ, హాజరత్ దేఖో! ఈపిల్లవాడు మన నిజాం స్టేట్‌మీద కత్తి కట్టి—దండెత్తిన కోటారెడ్డి, రుద్రమ్మలకు జన్మించాడు.

రజ్వీ—దేవో లడ్కాకీ పంతుల్.

పంతు—జీ, హాజరత్ (అని పిల్లవాణ్ణి అందిస్తాడు.)

రజ్వీ—(పిల్లవాణ్ణి తీసికొని) క్యారే లడ్కా! నీకీఖూడా బుద్ధీ ఖరాబ్ హైందికే? హింకా నీకీ లడ్కా జాత్నీ హుంఛారాద్. దేశముఖ్! సునో! ఈసభకీ హొచ్చినోళ్ళ ఫోసియరాద్. హీళ్ళ హాందఱ్నీ సిచ్చుల్ హిడిపించండీ దేనోకా నీకీ హిద్దే సెప్తాన్. హింకా హీళ్కీ మన రాజ్జెంలో హుంఛాఖూండా సఫాసేస్ హాకేయాలా.

(పిల్లవాణ్ణి పైకెత్తుతుండగా రుద్రమ్మ తటాలున వచ్చి చేయి పట్టుకొనును.)

రజ్వీ—తూ కౌన్ సైతాన్?

రుద్రమ్మ—(బిడ్డ నమాంతం లాక్కొని) నను గన్న చిన్నారి తెనుగు తండ్రికి తల్లిని.

రజ్వీ—(దేశముఖు, పంతులు దిగ్భ్రాంతితో దిక్కులు చూస్తుండగా ఉగ్రుడై రుద్రమ్మమీద కలియబడబోగా నిజాం నవాబు పరివారంతో ప్రవేశిస్తాడు.)

నవాబ్—ఠహిరో! బద్మాష్! (చేయిపట్టుకొని కత్తిలాక్కుంటాడు)

రజ్వీ—(ఉగ్రుడై చూడకుండా విదళించుకొని) తూ కౌన్‌రే బద్మాష్?

నవాబ్—బాత్ కర్ నకో నమక్‌హారాం.

రజ్వీ—(తల వంచుకొని) జీ సర్కార్! మైనై దేఖ్నా.

(మహారాజశ్రీ, కోటారెడ్డి, మీరాసాహెబ్ సభలోంచి లేచి వచ్చి ప్రక్కన నిలబడతారు.)

నవాబ్—నాకీ ఫైసా కాజేసీ, నాకీ రాష్ట్రం ఫైనా, కమ్యూనిష్టోల్కీ—ధోలీ, నాకీరాజ్యం ధోపిళ్ళు చేయించి, నీకీ కమ్యూనిష్టోల్కీ—కల్సీ నాకీ రాజ్యం ఫాలించావాలా హనీ సూస్తుండారా మీాకీ ?

రజ్వీ—ముఝుకో కుచ్ మాలుంనై నవాబ్ సాబ్.

మహా—జీ నవాబ్ సాబ్ ! యదార్థంగా మీా అవ్యాజప్రేమతో జీవిస్తున్న ఈ ఇత్తేహాదుల్ ముస్లిమీాన్ సంఘం, యీా రజాకార్ల సంఘం, వాటి మూలవిరాట్టయిన ఈ ఖాసిం రజ్వీ మహామహులు నానాటికి మీా రాజ్య మంతా ఆక్రమించుకొంటానికి తయారయి మీా బంగారు రాజ్యాన్ని నానాఅరాజకాల్లోకి దించారు. ప్రపంచపరిణామ పరిస్థితుల ననుసరించి, దేశ, కాల, పరిస్థితుల్ని గుర్తించి, మీారు ఇండియన్ యూనియనులో ప్రవేశించి మీా రాజ్యంలో బాధ్యతాయుత ప్రజారాజ్యాన్ని మీారు నెలకొల్పబోతున్న సందర్భంలో యీా రజ్వీ మీారాజ్యానికి వేరుపురుగుగా పుట్టి మీారాజ్యాధికారుల్ని సైన్యాధికారుల్ని తన పక్షానికి తిరగదీసికొని రాజ్యాన్ని అరాజకంలోకి దించి, మీామీాద తిరుగుబాటుచేసి, మిమ్మల్ని పదభ్రష్టుల్నిచేసి, తాను నిజాం కుశ మహమ్మదీయ మహాయుగ ప్రభుత్వాన్ని ముండింప చేయాలని ప్రయత్నిస్తున్నాడు. జీ, నవాబ్ సాబ్! పైనా అల్లా వుండబట్టే కట్టకడకు ఇట్లా పాపం బ్రద్దలైంది. జీ, నవాబునాబ్ నిన్ను, నీసమత్వ దృష్టిని చూచి ప్రపంచం మంచి దారిలో బడపోతున్నది. నిజంగా హిందూ ముసల్మాను సమైక్యత నీవు నీరాజ్యంలో తెచ్చి పెట్టినట్లు మరె

కెన్నటా లేదు. కనుక మహా తెలంగాన్ రాష్ట్రానికి నిన్నే ప్రప్రథమంగా గవర్నరుగా పెట్టుకొని పూజించుకో తలచుకొన్నాం.

నవాబు—అచ్ఛా, అచ్ఛా హై. నాకీ ఖూడా ప్రజల్లో హలాకాన్ని ఒటుర్తె హుండావాలా హాని బుద్ధి పుట్టింది, హిప్పుడు నమ్మక్ హరాముల్కి ఖైదీసేసీ ఇండియను యూనియన్కి పట్టివ్వాలి.

మంత్రి—నవాబ్ సాబ్ ఇంకా, ఈ రజ్వీ, రజాకార్లూ, వారి అనుచరులూ అంతా మనకి ఖైదీలుగా చిక్కారు. ఇహ తప్పించుకొనిపోవటం వాళ్ళ తరంకాదు. జై హింద్ మహా తెలంగాన్! జై నిజాం నవాబ్ సాబ్ కీ! (అంతా అంటారు.)

నవాబు—అయ్యా మీకీ హింగా నాకీ రాజ్యాన్ని జరూర్గా ఇండియన్ యూనియన్లో సేర్పండి. మీకీ ఇష్టం వచ్చినట్లు బాధ్యతా యుత ప్రజాప్రభుత్వాన్ని పెట్టండి. నాకీ ఖూడా ఒకాక వోటుగ్నే, మన్కి కోటారెడ్డినే మన్కి రాష్ట్రానికి ప్రైమ్ మినిష్టర్గా సేయండి. (పోలీసులు రజ్వీని, పంతుల్ని, దేశముఖ్ని సంకెళ్ళువేసి బంధింతురు.)

కోటా—జై హింద్ మహా తెలంగాన్! అయ్యా! మన ప్రజాప్రభుత్వం.

మును సత్యాగ్రహ యుద్ధమందెదురు
    బొమ్మల్ వడ్డతమ్ముల్ మహా
వనముల్ పట్టకముందు నేడు
    ప్రభు సిబ్బందిన్ కటాక్షించు చుం
డిన మర్యాదగ నాయకోత్తముఉ
    పున్నెంబెంతయో కట్టుకొ
న్న నిరోధించు విరోధి యుండడుగదా
    నాజూకు దేశంబులో.

రుద్రమ్మ—అయ్యా ! మన మహాతెలంగాన్ రాజ్యంలో.

ప్రారంభించు ప్రజాప్రభుత్వమున
బిర్లా బిళ్ళ బంట్రౌతులై
నారీనాయకులంచు మాటపడకుండన్
శాంతి సంగ్రామ వీ
రా! రత్నాల స్వదేశమాత రథ
సారధ్యంబుతో భూమిపై
ధారాళమ్ముగ గొప్పధర్మమును
సంస్థాపించి పాలించుడీ.

మహా—నిజంగా మీ ఇరువురి దాంపత్య ధర్మం దేశసేవా ప్రభావం వల్లనే యీ వినూత్న లోకంలోకొచ్చాం.

ఉరిబడ్డ వీరభారత
పురుషోత్తములెల్ల ధారబోసిన సిరితో
భరతావని కప్పురసగ
స్వరాజ్య సంవత్సరాది పండుగ వచ్చెన్.

రుద్రమ్మ—మహాతెలంగాన్ ముక్కోటి తెనుగు తల్లితండ్రులారా, మహాకవి పరమేశ్వరులారా!

ఐన పరాభవాన నులియై బలియై
బ్రతుకెక్కడున్నదో
కాని యింత విప్లవ యుగాన
మహోర భూమియైన దే

శాంతి దేవపుత్రులయి సత్యవివాక్కు

ప్రతిధ్వనించుచో

మానవ జీవితాలకు సమస్త

జయాలు లభించు హాయిగా.

జైహింద్ మహాతెలంగాన్! చలో హైద్రాబాద్!

— కీర్తన —

మహాతెలంగాన్ మహారాజశ్రీ.

నిజాంకోటపై ధ్వజం కట్టాలోయ్.

మంగళహారతి పాడుదుము.

శ్రీ శ్రీ శ్రీ



